# జీవన్ మరియు హను ఎదురుచూస్తున్నారు

## రాబోయే సమాచార ప్రచార సాధనాలకోసం

1988 తర్వాత, అట్లాంటిక్‌కి అటునైపుగా పంపే టెలిఫోన్ సంభాషణలను 'గ్లాస్ ఫైబర్'ను ఉపయోగిస్తూ 'లేసర్ దర్శిని' ద్వారా పంపించవచ్చును.

(కేంద్రీకరించబడిన కాంతి శక్తి) లేసర్ విద్యుత్ ప్రవాహంకన్న, రేడియో తరంగాల-కన్న ఎక్కువ సమాచారాన్ని తీసుకువెళ్ళే వాహకత కలిగివుంది. 'గ్లాస్ ఫైబర్స్' ప్రతి-క్షణానికి 560,000,000 'పుటాల' సమాచారాన్ని తీసుకువెళతాయి: అంటే ఒకే సారిగా 40,000 టెలిఫోన్ సంభాషణలన్న మాట!

చిత్రాలనిగూడా, రేడియో తరంగాలు కాకుండా



ప్రత్యేకకాంతిని వాడి. 1000 లక్షల టీవీ ఛానల్స్ ద్వారా ఆడే విధంగా ఒకేసారిగా ప్రసారం చేయవచ్చును.

లేసర్‌ను, టీవీ రిసీవర్ లోపల వాడి, చిత్రాలను చూపించేలా చేయవచ్చు. లేసర్‌గన్, ఒక



పట్టకం ద్వారా ఉద్భుతమైన తెలుపుకాంతి కిరణాన్ని పంపిస్తుంది. ఆ కిరణం మూడుగా విడిపోతుంది: ఎరుపు, నీలం, ఆకుపచ్చగా. మరొక పట్టకం యీ రంగుల్ని ఒక సన్నని రంగుల కిరణపు 'మిక్స్'గా కలుపుతుంది- నిజానికి యిది ప్రతి క్షణానికి కొన్ని వేలసార్లు మారుతుంది!

ఈ సన్నని కిరణం తెరపైన ఊహించలేనంత వేగంతో కదులుతూ పూర్తి చిత్రాన్ని 'అమరుస్తుంది!'. అంత అద్భుతమైన వేగంతో అది కదలుతూన్నప్పుడు అనిపిస్తుందిగదా-ఆతెర సమస్తం అందమైన, అత్యంత స్పష్టమైన చిత్రంతో ధారావాహికంగా వెలుగుతోందని

లేసర్‌కి వివిధోపయోగాలున్నాయి-, అతి సున్నితమైన కంటి ఆపరేషన్లకూ, సైన్యంలో ఎంతో శక్తిగల ఆయుధంగానూ, భారీ పరిశ్రమల్లో లోహాలను కొయ్యడానికి, ఉక్కుని కొయ్యడానికీను.

భవిష్యత్తులో, సొంతమైన పోర్టబుల్ ట్రాన్సీవర్ ద్వారా ఎవరైనా యీ ప్రపంచంలో ఎవరితోనైనా మాట్లాడవచ్చును. అవి భూమి అంతటా భ్రమించే పందల ఉపగ్రహాల ద్వారా మరో ట్రాన్సీవర్‌తో నైనా కలుపుతాయి. ప్రతి దేశానికి, ప్రతివ్యక్తికీ ఒక గుర్తింపు సంఖ్య ఉంటుంది. మరియు లక్షల లక్షల అంకెలన్నీ వేలిగోరు సైజులోగల కంప్యూటర్లలో నిలవ చేయబడాయి- అవే డైరక్టరీలలాగ పనిచేస్తాయి!





జీవిత భీమా అనేది మీ
కుటుంబాన్ని సురక్షితంగా
ఉంచుకోవడానికి
అతి భద్రమైన మార్గం



లైఫ్ ఇన్సూరెన్స్
కార్పొరేషన్
ఆఫ్ ఇండియా



1983 WORLD COMMUNICATIONS YEAR



daCunha/LIC/144/83 TL

నా విమానంలో మేఘాల్లోకి ఎగిరేపోతానూ
ఊరుకుందిక ఉరిమే మేఘం జెమ్స్ తిన్నాకా
నేలమీద మనకంతా ఎంతెంతో సరదాగా
నీకూ జెమ్స్, నాకూ జెమ్స్, అందరికోసంగా!








చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి. క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''వీరసేనుడి స్వార్థం'']కు ఆధారం ''వసుంధర'' రచన.

సమాజంలో హక్కులూ, బాధ్యతలూ తెలియని వ్యక్తులు కొందరుంటారు. అందువల్ల నష్టపోయేది అయా వ్యక్తులే. కాని, హక్కులు మాత్రం తెలిసి, బాధ్యతలు తెలియని వాళ్ళవల్ల యితర్లకు కీడు కలిగే ప్రమాదం వున్నది. ఇది, ''బాధ్యత తెలిసినవాడు'' అన్న కథలో మనం తెలుసుకుంటాం.

## అమరవాణి

భీతిదః సుజనోపి స్యాత్, యది దుర్జన సేవితః,
పన్నగ స్యాశ్రయం వృక్షం, చందనం కః సమాశ్రయేత్.

[దుర్జనుడికి ఆశ్రయం యిచ్చిన సజ్జనుణ్ణి చూసి, పరులు భయపడతారు. చందనవృక్షం పాముకు ఆశ్రయం అయినందువల్లనే, దాని నీడలో ఎవరూ విశ్రమించరు.]

సంపుటి 73 డిసెంబర్ '83 సంచిక 6

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## అతి వేగంగా పయనించే చందమామ

మనకు కనిపించే చందమామకన్నా మూడురెట్లు ఎక్కువ వేగంతో పయనించే చందమామ ఒకటి మన సూర్యమండలంలో వున్నట్లు ఇటీవల తెలియవచ్చింది. ఏడుగంటలకొకమారు గురుగ్రహాన్ని చుట్టి వచ్చే ఈ చందమామ—గంటకు డెబ్బైవేల నాలుగువందల మైళ్ళ వేగంతో పయనిస్తున్నదట.

## బెర్మూడా ట్రయాంగల్ నిగూఢమర్మం



పశ్చిమ అట్లాంటిక్ మహాసముద్రంలో బెర్మూడా–ఫ్లోరిడా మధ్య బెర్మూడా ట్రయాంగల్ అనే ప్రాంతం వున్నది. ఈ ప్రాంతాన్ని సమీపించే ఓడలూ, విమానాలూ అదృశ్యమైపోతున్నాయి. హఠాత్తుగా నూరడుగల ఎత్తునలేచే ఉప్పెనలే ఓడలను కబళిస్తున్నాయని–కెనడా లోని నేషనల్ రీసెర్చి కౌన్సిల్‌కు చెందిన జోఫ్లోగ్ అభిప్రాయ పడుతున్నాడు. మరి విమానాలను కూడా ఈ ఉప్పెనే నాశనం చేస్తున్నదా అన్నది నిగూఢమర్మంగానే వున్నది.

## నూతన వినోదంలో రికార్డు



ఇంగ్లాండులోని యార్క్‌షైర్‌లో వుంటూన్న డెబ్బైనాలుగేళ్ళ రెగ్ మెల్లర్ అనే పెద్దమనిషి ఒక నూతన వినోదంలో సరికొత్త రికార్డు సృష్టించాడు. సూదుల్లాంటి గోళ్ళూ, రంపం లాంటి పళ్ళూ వున్న మానుపిల్లుల చేత ఎడతెరపిలేకుండా ఐదు గంటలా, ఇరవై ఆరు నిముషాలు కరిపించుకున్నాట్ట రెగ్ మెల్లర్. యార్క్‌షైర్ ప్రజల్లో మానుపిల్లుల చేత ఎంతసేపు కరిపించుకోగలం? అన్నది సరికొత్త వినోదంగా ప్రబలమవుతున్నది.

## మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైన వృక్షం ఎక్కడ వున్నది?
2. రెండువేల సంవత్సరాల క్రితం, భారత దేశం నుంచి అంటుకట్టి తీసుకుపోయి నాటిన వృక్షం ఏది? ఎక్కడ వున్నది?
3. ప్రపంచంలోకెల్లా అతి లావైన వృక్షం ఎక్కడున్నదో తెలుసా?
4. చూస్తుండగానే పెరిగే చెట్టు ఏదో మీకు తెలుసా?
5. ఒకే బోదెతో విశాలమైన స్థలాన్ని ఆక్రమించుకున్న వృక్షం ఏది? ఎక్కడున్నది?

(సమాధానాలు 64వ పేజీలో)



# బాధ్యత తెలిసినవాడు

ఆనందపురం జమీందారు ఆనందరాయణానికి వృద్ధాప్యం సమీపించింది. ఆయనకు ముగ్గురు కొడుకుల తర్వాత, ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు స్వర్ణ. తన ఆస్తితోబాటు కుమార్తె పెళ్ళి బాధ్యత కూడా కొడుకులకు పంచాలన్నది, ఆయన ఆలోచన. కుమార్తెకు అంతవరకూ కొన్ని సంబంధాలు చూశాడుగాని, అవేవీ ఆయనకు నచ్చలేదు.

ఒకనాడు ఆయన, తన కొడుకులలో చెల్లెలి పెళ్లి బాధ్యత తీసుకోగలవాణ్ణి ఎన్నిక చేయాలని యోచించి, ముందుగా పెద్దకొడుకు శ్రీకాంతుణ్ణి తన దగ్గిరకు పిలిపించాడు.

"నాయనా, నా ఆస్తిని నాలుగు భాగాలుగా విభజించి, మీ నలుగురికీ సమానంగా పంచాలనుకుంటున్నాను. స్వర్ణకు మంచి సంబంధం చూసి, నువ్వే వైభవంగా పెళ్ళి చెయ్యాలి," అన్నాడు ఆనందరాయణం.

శ్రీకాంతుడు ఎంతో వినయంగా, "అలాగే, నాన్నగారూ! నాలుగుభాగాలుగా చేసే బదులు, మూడు భాగాలుగా విభజించండి. అన్నదమ్ములం ముగ్గురం కలిసి, చెల్లాయి పెళ్ళికయ్యే ఖర్చు భరిస్తాం. తర్వాత ఆమెను అత్తవారింటికి పంపిస్తాం," అన్నాడు.

ఆనందరాయణం తల వూపి, "సంబంధాలు ఏవీ కుదరడం లేదు. నేను బతికుండగా అమ్మాయి పెళ్ళి చూడగలనో, లేదో!" అన్నాడు.

శ్రీకాంతుడు ఓదారుస్తున్నట్టుగా, "మీకా చింత అక్కర్లేదు, నాన్నగారూ! తమ్ముళ్ళూ, నేనూ మంచి సంబంధం వెతికి, చెల్లెలి పెళ్ళి ఘనంగా జరిపిస్తాం. ఆస్తి పంపకం విషయం నేను చెప్పినట్టు

బొమ్మిడి అచ్చారావు



చేస్తే బావుంటుంది. ఆ విషయంలో మాత్రం, తొందరపడకుండా బాగా ఆలోచించి చేయండి,'' అన్నాడు.

ఆనందరాయణం అతన్ని పంపేసి, రెండో కొడుకు శ్రీనివాసుణ్ణి రప్పించాడు. అతడికూ్కడా శ్రీకాంతుడికి చెప్పినట్టే చెప్పి, ''చెల్లెలి పెళ్ళి చూడాలని వుంది, నాయనా!'' అన్నాడు.

''అలాగే, నాన్నగారూ! తప్పకుండా ఎక్కడైనా మంచి సంబంధం చూసి పెళ్ళి జరిపిస్తాం. అయితే, ఆస్తి విషయంలో మీరన్నట్టుగా కాక, కొంత మార్పు చేస్తే బావుంటుందని, నా అభిప్రాయం,'' అన్నాడు శ్రీనివాసుడు.

''ఎలా చేస్తే బావుంటుంది?'' అని అడిగాడు ఆనందరాయణం.

''ఆరుభాగాలు చేయిస్తే బావుంటుంది,'' అన్నాడు శ్రీనివాసుడు.

''ఆరుభాగాలా? ఏం, అలా అంటున్నావు?'' అన్నాడు ఆనందరాయణం ఆశ్చర్యపోతూ.

''ముందు చెల్లాయితోపాటు నలుగురం, నాలుగు భాగాలు పంచుకుంటాం. తర్వాత చెల్లాయి పెళ్ళికి ఒక భాగం ఖర్చు పెడతాం,'' అన్నాడు శ్రీనివాసుడు.

ఆరో భాగం తన శేషజీవితం గడుపుకోవడానికి అట్టే పెట్టుకోమంటాడని, జమీందారు అనుకున్నాడు. కాని, శ్రీనివాసుడు చెప్పింది ఆయన్ని మరింతగా ఆశ్చర్యపరిచింది.

''నాన్నగారూ, స్వర్ణకు పెళ్ళి జరిపెయ్యడంతో మన బాధ్యత తీరిపోదుగదా! ఆమె పెళ్ళయాక పుట్టింటి మర్యాదల కోసం, యింకా ప్రసూతి మొదలైన అవసరాల కోసం వస్తూ పోతూ వుంటుంది. ఆస్తిలో వేరుగా వుంచిన ఆరోభాగం అలాంటి ఖర్చులకు ఉపయోగపడుతుంది,'' అన్నాడు శ్రీనివాసుడు.

ఆనందరాయణం, శ్రీనివాసుణ్ణి పంపేసి, మూడో కొడుకును పిలిపించాడు. అతడి పేరు శ్యామలుడు.

జమీందారు అతడికీ అన్నలకు చెప్పినట్టే చెప్పి, "ఆస్తిని నాలుగు భాగాలు చెయ్యడం, నీకేమైనా అభ్యంతరమా ?" అని అడిగాడు.

"అభ్యంతరమే, నాన్నగారూ !" అన్నాడు శ్యామలుడు.

"అభ్యంతరమా! అదేం, అలా అంటున్నావు ?" అని అడిగాడు అనుమానంగా అనందరాయణం.

"ఆస్తిని విభజించవలసిన అవసరం ఏమొచ్చింది, నాన్నగారూ ?" అని ప్రశ్నించాడు శ్యామలుడు.

"నా కింకెన్నేళ్ళో బతకననిపిస్తున్నది, బాబూ ! నేను బతికుండగానే, మీ నలుగురికీ న్యాయం చేసి పోవాలనుకుంటున్నాను. నేపోయాక, ఆస్తికోసం మీరు పోట్లాడుకోరాదన్నది, నా కోరిక," అన్నాడు జమీందారు.

"మీరు యింకా పదేళ్ళు ఆరోగ్యంగా వుంటారు; ఆ నమ్మకం, నా కున్నది. మంచి సంబంధం చూసి, ముందు చెల్లాయి పెళ్ళి చెయ్యాలి. ఆ తర్వాతనే ఆస్తి పంపకాల విషయం ఆలోచిస్తే బావుంటుంది," అన్నాడు శ్యామలుడు.

ఆనందరాయణానికి అతడి మాటలు చాలా ఆనందం కలిగించాయి.

"అలాగే చెయ్యొచ్చు, బాబూ! అయినా, ఆస్తి పంచడం వల్ల, అందుకు ఆటంకం ఏం కలుగుతుంది? పైగా మీ చెల్లె స్వర్ణకు ఒక వాటా పంచుతున్నాం కదా. అందులో



నుంచి ఆమె పెళ్ళికి ఖర్చుపెట్టవచ్చు, ఏమంటావు?" అని ప్రశ్నించాడు జమీందారు.

"అదేమిటి, నాన్నగారూ! ఆడపిల్ల బాధ్యత అందరిదీకాదా? అదీగాక, ఆస్తి పంచి యిచ్చేస్తే, మీ సంగతేమిటి? ఆ పంచడం జరిగాక, మీ సంగతి ఎవరూ పట్టించుకోకపోవచ్చు. చెల్లాయి ఆస్తి, ఆమెకు పెళ్ళి చేస్తుందా? అందువల్ల, మీరు ప్రస్తుతానికి ఆస్తి పంచే విషయం పూర్తిగా మరిచిపొండి," అన్నాడు శ్యామలుడు.

ఆనందరాయణిం కొంచెం సేపు ఆలోచిస్తూ ఊరుకుని, "మరి, చెల్లాయికి సంబంధాలు చూడడం అంతతొందరగా అయ్యే పని కాదు, బాబూ! మన హోదాకు తగినట్టు ఘనమైన సంబంధం చూడాలి. ఇదంతా జరిగేసరికి, నేను వుంటానో లేదో!" అన్నాడు.

"చెల్లాయి పెళ్ళికి తగిన ఏర్పాట్లు చేసే వున్నాను, నాన్నగారూ! నాకు, వేమవరం జమీందారు వంశానికి చెందిన మిత్రుడొకడున్నాడు. అతను, చాలా మంచివాడు, మన స్వర్ణ గురించి ఆసక్తి కనబరుస్తున్నాడు. అతడి చిత్రపటం కూడా తీసుకున్నాను. మీకు నచ్చినట్టయితే, వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడవచ్చు. మనకు అన్నివిధాలా సరిపడే సంబంధం," అన్నాడు శ్యామలుడు

ఆనందరాయణిం కొడుకును ఆప్యాయంగా ఆలింగనం చేసుకుని, "నువ్వు, నా కొడుకువనిపించుకున్నావు, నాయనా! నీ అన్నలు, ఆస్తిని ఎన్ని భాగాలు చెయ్యాలో లెక్కలు వేసినవాళ్ళేగాని, ఒక్కడూ చెల్లాయి పెళ్ళి గురించి బాధ్యత తీసుకుంటానని ముందుకు రాలేదు. కనీసం నా శేషజీవితం గురించి ఆలోచించినవాడు కూడా లేడు. నువ్వు చెప్పిన సంబంధం అన్నివిధాలా బావుంటుందనిపిస్తోంది. రేపే వెళ్ళి, ఆ అబ్బాయి పెద్దవాళ్ళను కలుసుకుని మాట్లాడదాం," అన్నాడు.






## 8

[పింగళుడు మరొకసారి పాడుదేవళంలో ప్రవేశించి, అక్కడవున్న దుష్టశక్తులను జయించి, మహామాయుడి సమాధిని చేరాడు. తరవాత, మహామాయుడి వేలినున్న ఉంగరాన్నీ, వజ్రాలు తాపిన పిడిగల కత్తినీ, భూగోళాన్నీ తీసుకుని సురక్షితంగా బయటికి వచ్చాడు. అంతలో నదీగర్భం నుంచి పెద్ద ధ్వనితో నీటిధార ఒకటి పైకి లేచింది. తరవాత—]

అంత గొప్ప మాంత్రికుడైన పద్మపాదుడు, నదీగర్భంనుంచి పైకి లేచిన నీటిధారను చూసి, అదిరిపడి వెనకడుగువేయటం, పింగళుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు పద్మపాదుడి పక్కనే నిలబడి నిర్భీతిగా ఆ నీటి ధారకేసి చూస్తూ, ''పద్మపాదా! కావాలంటే ప్రపంచం మొత్తాన్నే దాసోహం అనిపించుకోగల శక్తులు మన దగ్గిర వున్నవిగదా? అటువంటప్పుడు, ఆ నీటిధారను చూసి మనం భయపడడం ఎందుకూ?' అని అడిగాడు.

పింగళుడి ప్రశ్న వింటూనే పద్మపాదుడు కొంత కుదుట పడ్డాడు. అతడు పింగళుడి కేసి తిరిగి, ఆప్యాయంగా అతడి భుజం తడుతూ, ''పింగళా, నీవంటి యువవీరుడు నా పక్కన వుండగా, నేను దేనికీ భయపడను. ఏ మంత్ర తంత్రాలూ తెలియని నువ్వు కన



బరచిన తెగువతనం, నిర్భయత్వం అమోఘం. నేను ఆ నదీగర్భం నుంచి లేచిన నీటిబుగ్గనుచూసి భయపడటం లేదు. కాని....'' అంటూ మరోసారి నదీగర్భం కేసి చూశాడు.

''సంశయిస్తారెందుకు? సంగతేమిటో చెప్పండి!'' అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు ఓ చిరునవ్వు నవ్వి, ''మనం మహామాయుడి నుంచి అన్ని అద్భుత శక్తుల్నీ సంగ్రహించాం. ఆ కారణంవల్ల ఈ భల్లూక పర్వత ప్రాంతాల్లో ఇంతకుముందు విచ్చలవిడిగా విహరిస్తున్న దుష్ట శక్తులన్నీ శక్తిహీనం కావలిసింది. కాని, అలా జరగకపోగా, మరింతగా ఆ శక్తులు విజృంభిస్తున్నవి. దీనికి కారణం ఇప్పటిగ్గాని అవగాహన కాలేదు,'' అన్నాడు.

పింగళుడు తనకేమీ తెలియలేదన్నట్టుగా తలపంకించాడు. పద్మపాదుడు తిరిగి ఏమో చెప్పబోయేంతలో, పొంగులు వారుతున్న నదీ జలం మీద అనేక భీకరాకారాలు, వివిధాయుధాలు ధరించి వికృతంగా అరుస్తూ పోరాటం ప్రారంభించాయి.

ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నిలువెల్లా నీరయిపోతూ, ''పద్మపాదా! ఇప్పుడేం దారి? నా జీవితంలో ఆఖరుకు కలలో కూడా ఇన్ని వికృతాకారాల్ని చూడలేదు. వీటిమీద మనం సంపాయించిన మహాశక్తిసంపన్నమైన ఆయుధాలను ప్రయోగించవలసిందేనా?'' అన్నాడు.

పద్మపాదుడు ఓ క్షణకాలం తల వంచుకు ఊరుకుని, ''ఉహూఁ'' అంటూ తలాడించి పింగళుడి కేసి చూస్తూ, ''ఇంతవరకూ వీటిని అదుపాజ్ఞల్లో ఉంచిన మహామాయుడి సమాధిని మనం చేరగలిగాం, అతడి శక్తులు కూడా మన వశం అయాయి. కనుక ఇప్పుడు ఈ దుష్టపిశాచగణానికి నాయకుడు లేడు. అవన్నీ నాయకత్వం కోసం పోరాడుతున్నవి. మనం ఒక పని చేస్తే బావుం



టుంది. భల్లూకకేతుడి సంగతి నువ్వు మరిచిపోలేదుగదా?'' అన్నాడు.

''భల్లూకకేతుడా! అతణ్ణి ఎలా మరవ గలను. అతడు ఒకప్పుడు ఈ పర్వత ప్రాంతాలకు అధిపతినని కూడా చెప్పాడు. మనం, తిరుగు ప్రయాణంలో అతడికి లోహశృంఖలాల నుంచి విముక్తి కలిగిస్తా మని మాట కూడా ఇచ్చాం!'' అన్నాడు పింగళుడు.

''అదీ సంగతి! మనం అతడికి ఇచ్చిన మాట నిలుపుకునేందుకూ్కడా ఇదే మంచి అదను. ఈ భల్లూక పర్వత ప్రాంతాలకు అధిపతి అంటూ ఎవడూ లేకపోతే, ఈ చిన్నా పెద్ద భూతాలు, తమలో తాము తగవులాడి, ఈ పరగణా అంతా అల్లకల్లోలం చేయగలవు. కనుక, మనం తిరిగీ ఆ భల్లూకకేతుడికి వీటిమీద ఆధిపత్యం ఇద్దాం,'' అన్నాడు పద్మ పాదుడు.

''చాలా మంచి యోచన, అలాగే చేయండి,'' అన్నాడు పింగళుడు.

''అయితే, నువ్వు వెంటనే బయలు దేరు. ఆ అడవిలో భల్లూకకేతుడు ఉన్న కొలను ప్రాంతం నీకు తెలిసిందే గదా ? అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి ఇక్కడకు తీసుకురా!'' అన్నాడు పద్మ పాదుడు.

పింగళుడు సరేనన్నాడు. పద్మపాదుడు తన మొలనున్న మహామాయుడి వజ్రాలు తాపిన పిడిగల కత్తిని పింగళుడికి ఇస్తూ, ''నీకు వాహనంగా ఆ పిశాచ గార్దభం ఉంటుంది. ఈ కత్తి సాయంతో నువ్వు భల్లూకకేతుడిని సమీపించకుండానే అతడిని బంధించివున్న ఇనప సంకె ళ్ళను పూడకొట్టవచ్చు! ఇదిగో, నీ వాహనం!'' అంటూ గదను గాలిలో తిప్పాడు. వెంటనే భూమి విచ్చుకుని, అందులోనుంచి ఓండ్రిస్తూ పిశాచ గార్దభం బయటికి గెంతింది.

పింగళుడు, మహామాయుడి కత్తిని చేబూని పిశాచ గార్దభం మీద కూర్చు

న్నాడు. గార్దభం గాలిలోకి లేచింది. కొండలూ, నదులూ, అడవులూ, దాటి కొద్దిసేపట్లోనే పింగళుడు, భల్లూకకేతుడు బంధింపబడివున్న కొలను ప్రాంతం చేరాడు.

కత్తి చేతబట్టి, గాడిద మీద ఎక్కి గాలిలో ఎగురుతున్న పింగళుణ్ణి చూస్తూనే భల్లూకకేతుడు పెద్దగా మూలిగి, ''అయ్యో, ప్రభో, దేవా, గార్దభేంద్రా! నన్ను రక్షించండి. ఈ ఇనప గొలుసులు బద్దలుకొట్టి పుణ్యం కట్టుకోండి!'' అంటూ అరవసాగాడు.

పింగళుడు నవ్వుతూ, కొలను ఒడ్డునే గార్దభం మీంచి దిగి, ''భల్లూకా! నేను ఏదో దేవుణ్ణనుకుని నాకు గార్దభేంద్ర బిరుదు యిస్తున్నట్టుంది. నేను మనిషిని, లోగడ నన్ను ఒకమారు చూశావు. నా పేరు పింగళుడు!'' అన్నాడు.

''మీరు పింగళులా, అయ్యా! ఇప్పుడు గుర్తు కొచ్చింది. మహామాయుడి సమాధి మీదికే దాడి వెడలిన ఆ ఘన మంత్రవాది పద్మపాదుడు మీ గురువుగదా?'' అన్నాడు భల్లూకకేతుడు.

''అవును, నీ జ్ఞాపకశక్తి మెచ్చదగిందే!'' అన్నాడు పింగళుడు.

''అయ్యా, ప్రభూ! ఆ మంత్రవేత్త సుఖంగా వున్నారా? మహామాయుడి సమాధిలో ప్రవేశించటం సాధ్యమైందా?'' అని అడిగాడు భల్లూకకేతుడు ఆదుర్దాగా.



''ఆ సమాధిలో ప్రవేశించింది నేను. ఇదిగో ఆ మహామాయుడి మంత్రశక్తిగల ఖడ్గం!'' అంటూ పింగళుడు తన చేత నున్న కత్తిని ఝుళిపించి, దాని కొనను భల్లూకకేతుడి కేసి సూటిగా గురిపెట్టాడు.

మరుక్షణంలోనే కళ్ళను మిరుమిట్లు కొలిపే కాంతిరేఖలు మెరుపు వేగంతో కత్తి నుంచి బయలుదేరి, భల్లూకకేతుడిని బంధించివున్న ఇనపగొలుసును తాకినై. తక్షణం ఆ ఇనపగొలుసు గడ్డి తాడులా ఒక్కసారి భగ్గుమని మండి బూడిద అయి, నుసిగా మారి రాలి పోయింది.

భల్లూకకేతుడు తన మహాకాయాన్ని ఒక్కసారి విదిలించుకుని, లేచి నిలబడ్డాడు. అతడు కృతజ్ఞత వుట్టిపడే నేత్రాలతో, పింగళుణ్ణి సమీపించి, అతడికి సాష్టాంగపడుతూ, ''ప్రభూ! మీరు నన్ను బంధవిముక్తుణ్ణి చేసి, ఎంతో కాలంగా నే పడుతున్న యాతననుంచి నన్ను కాపాడారు. మీ దయవల్ల నేను నరకబాధ నుంచి బయటపడ్డాను. ఈ ఘడియనుంచి నేను మీకు దాసుణ్ణి! ఏమి సెలవు!'' అన్నాడు.

''మనం యిప్పుడే బయలుదేరి పద్మ పాదుణ్ణి చేరాలి. మహామాయుడు తన శక్తిని కోల్పోయిన తరవాత, భల్లూక పర్వత లోయలో గల చిన్నా పెద్ద పిశాచాలు నాయకత్వం కోసం గుద్దులాడు కుంటున్నై. నీవంటి బలవంతుణ్ణి, శక్తి





మంతుణ్ణి తిరిగి ఆ క్షుద్ర జీవాలకు నాయకుడిగా చేయాలని పద్మపాదుడి అభిప్రాయం. అలా కానప్పుడు ఆ పిశాచాలు ఊళ్ళనూ, రాజ్యాలనూ పంచుకుని, ఈ ప్రాంతాలను నానా కశ్మలం చేయవచ్చు.'' అన్నాడు.

పింగళుడి మాటలు వింటూనే భల్లూకకేతుడు వెలవెలపోయాడు. అతడు రెండు చేతులూ జోడించి, పింగళుడికి నమస్కరిస్తూ, ''ప్రభూ! ఇక నాకు ఈ భూతగణం మీద నాయకత్వం వద్దు. ఆ పదవి అనుభవించటం ఎంత బాధాకరమో నాకు తెలిసివచ్చింది. ఏ మంత్రవేత్తో, లేక ధైర్యసాహసాలు గల యువకుడో మా మీదకు దాడిరావటం, మేము యిన్ని శక్తులూ, కుయుక్తులూ ఎరిగివుండి కూడా వాళ్ళ ధాటికి తట్టుకోలేక ఎక్కడికో పారిపోవటం—అదీ మా జీవితం! నేను, ఈ నాటినుంచి మానవులను సేవించి బతకదలిచాను! మానవుల్లో మీరు అతి సాహసోపేతులని నాకు తెలిసివచ్చింది. నన్ను మీ దాసుడుగా స్వీకరించండి. కావాలంటే మీ దగ్గర వున్న ఇతర దాసులమీదా, బానిసలమీదా నాకు నాయకత్వం ఇవ్వండి!'' అన్నాడు.

''భేష్, నీ భక్తికీ, వినయానికీ మెచ్చాను. కాని, నిన్ను ఎలా ఉపయోగించుకోవాలన్నది, నేను తేల్చగల సమస్య కాదు. పద్మపాదుడితో ముందుగా మాట్లాడి, ఆయన ఉద్దేశం ఏమిటో కనుక్కోవలసివుంది. ఇక బయలుదేరు!'' అన్నాడు పింగళుడు వెనుదిరుగుతూ.

పింగళుడు ఇలా చెప్పి తన పిశాచ గార్దభాన్ని ఎక్కి కూర్చోబోయేంతలో భల్లూకకేతుడు, పిశాచ గార్దభం నడుము పట్టుకుని, ''ప్రభూ! మీవంటి గొప్పవారూ, గౌరవనీయులూ ఇలాంటి క్షుద్ర పిశాచాలను వాహనంగా వాడుకోవటం తగదు. నా భుజాల మీద ఎక్కండి. క్షణంలో మిమ్మల్ని, మీ గురువు దగ్గిరకు చేర్చుతాను.'' అంటూ పిశాచ గార్దభాన్ని ఒంటి

చేత్తోనే ఎత్తి గిరగిరా గాలిలో తిప్పి, చెట్ల మీదుగా దాన్ని ఆకాశంలోకి విసిరివేశాడు.

గార్దభం దిక్కులు పిక్కటిల్లేలా ఓండ్రిస్తూ, ఎగరటం చూసి, భల్లూకకేతుడు బిగ్గరగా నవ్వి, "ప్రభూ! ఇక రండి! నా భుజాల మీద కూర్చోండి!" అంటూ పింగళుడి ముందు వినయంగా మోకరిల్లాడు.

పింగళుడు సంశయించకుండా, ఎలుగొడ్డు రూపంలో వున్న భల్లూకకేతుడి భుజాల మీదికి ఎక్కి కూర్చున్నాడు. భల్లూకకేతుడు వెంటనే గాలిలోకి ఎగిరి, కళ్ళు మూసి తెరిచేంతలో పింగళుణ్ణి పద్మపాదుడు వున్న చోటుకు తెచ్చి దించాడు.

పద్మపాదుడు భల్లూకకేతుణ్ణి చూస్తూనే మందహాసం చేసి, "కులాసాయేగదా? అటు చూడు!" అంటూ నదిలో పొంగులు వారుతున్న నీటిమీదా, పక్కలనే వున్న కొండరాళ్ళ మధ్యా పోరాడుతున్న అసంఖ్యాక రక్కసులను చూపి, "వీళ్ళంతా రాజరికం కోసం ఒకళ్ళ గొంతులు ఒకరు కోసుకుంటున్నారు. నీవు వాళ్ళ తగువు మాన్పి, వాళ్ళకు నాయకుడుగా, రాజుగా వుండాలని నేను కోరుతున్నాను," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, భల్లూకకేతుడు దిగాలు పడిపోయి, పింగళుడి కేసి దీనంగా చూశాడు. పింగళుడు, పద్మపాదుడితో, భల్లూకకేతుడి కోర్కె వివరించి, "నేను ఇతణ్ణి నా సేవకుడుగా తీసుకుంటాను," అన్నాడు.

"అందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. కాని, ఈ తగవులాడే రక్కసుల సంగతేమిటి?" అన్నాడు పద్మపాదుడు.

"వాటి సంగతి నాకు వదలండి! నేను...." అని భల్లూకకేతుడు ఏమో చెప్పబోయేంతలో ఒక్కసారిగా ఆ ప్రాంతం అంతా మార్మోగేలా, పిశాచాలన్నీ ఏక కంఠంతో, "భల్లూకకేతా! ఓహోం! ఓహోం!" అని అరుస్తూ, పద్మపాదుడు వున్న చోటుకు పోటీపడి పరిగెత్తుకు రాసాగాయి. —(ఇంకా వుంది)






# వీరసేనుడి స్వార్థం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఏదో ఒక మహత్తర కార్యం సాధించదలచి, యింత అర్ధరాత్రివేళ, భయానకమైన యీ శ్మశానంలో శ్రమలపాలవుతున్నావని అనుమానం కలుగుతున్నది. కాని, అందుకు నిన్ను ప్రోత్సహించిన వాడు, ఏ మంత్రవేత్తో కాదుగదా? అలాంటివాడి మాట నమ్మడం ఒక్కొక్కసారి ప్రమాదానికీ, నిరాశకూ కారణం అవుతుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, సువాకుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

వింధ్యారణ్య ప్రాంతాల్లో సకలశాస్త్ర పారంగతుడైన యోగి ఒకడుండేవాడు.

## బేతాళ కథలు



ఆయన వద్దకు ఎందరో శిష్యులు వచ్చి విద్యాభ్యాసం చేసి వెళుతూండేవారు. అలా వచ్చిన వారిలో సువాకుడనేవాడు మంత్రశాస్త్రంపై ఎక్కువ ఆసక్తి చూపించాడు. యోగి వాడికి మంత్రశాస్త్రంలో కొన్ని ప్రాథమిక సూత్రాలు మాత్రం చెప్పి ఊరుకున్నాడు.

''మంత్రశాస్త్రంలో నన్ను, మీ అంత వాణ్ణి చేయండి, స్వామీ!'' అని సువాకుడు యోగిని కోరాడు.

దానికి యోగి, ''మంత్రశాస్త్రం నేర్చుకునేందుకు అందరికీ అర్హత వుండదు. నీవది ప్రజాక్షేమానికే తప్ప, స్వార్థానికి ఉపయోగించవని నాకు నమ్మకం కలిగే వరకూ, నేనది నీకు ఉపదేశించలేను,'' అన్నాడు.

సువాకుడు యోగి వద్ద మరి కొంత కాలం బుద్ధిగా వుండి, శుశ్రూషలు చేస్తూ కాలంగడిపాడు. అయినా, ఆయన వాడికి మంత్రశాస్త్రోపదేశం ప్రారంభించలేదు.

ఒకనాడు సువాకుడు యోగిని, ''మీకు నాపై ఎప్పటికి నమ్మకం కలుగుతుంది, స్వామీ!'' అని అడిగాడు దీనంగా.

యోగి ఒకక్షణం ఆలోచించి, ''ఉజ్వల దేశపు రాజకుమారి విద్యుల్లతను ఎవరు వివాహమాడతారో, వారొక్కరే మంత్రశాస్త్రం నేర్చుకునేందుకు అర్హులు,'' అన్నాడు.

ఈ మాటలు వింటూనే సువాకుడు, యోగి వద్ద సెలవు తీసుకుని ఉజ్వలదేశం వెళ్ళాడు.

అక్కడ రాజధానీ నగరంలో వాడు తనకు వచ్చిన మంత్రాలను ప్రదర్శించి, పౌరులందరినీ అమితంగా ఆకర్షించాడు. ఈ వార్త రాజుదాకా వెళ్ళింది. రాజు వాడికి కబురు పెట్టి, ''తమరు ఇంద్రజాల విద్యలో ఘటికులని విన్నాను. మా అంతఃపురంలో, మీ ప్రదర్శన యిచ్చి, మమ్మానందింప చేయవలెనని కోరుతున్నాను,'' అన్నాడు.

అందుకు సువాకుడు వినయంగా, ''ప్రభూ, తమ కోరికను కాదనను.

అయితే, తమరనుకుంటున్నట్టు, నేను ఐంద్రజాలికుణ్ణి కాదు; వింధ్యారణ్య ప్రాంతాల వుండే ఒక మహాయోగి శిష్యుణ్ణి. మీ కుమార్తె విద్యుల్లత కారణ జన్మురాలు. ఆయన ఆదేశం మీద మీ కుమార్తెతో ఒక మాట చెప్పి పోదామని వచ్చాను,'' అన్నాడు.

రాజు సరేనన్నాడు. అంతఃపురంలో సువాకుడి ప్రదర్శన ఏర్పాటయింది. అందరూ వాడు చేసిన అద్భుతాలకు ఆశ్చర్యపోయారు.

ప్రదర్శన అయ్యాక విద్యుల్లత వాణ్ణి అభినందించేందుకు వచ్చింది. వాడామెను, ''నా ప్రదర్శన ఎలా వున్నది?'' అని అడిగాడు.

''జీవితంలో యిటువంటి అద్భుత విద్యాప్రదర్శన చూసి ఎరగను!'' అన్నది విద్యుల్లత.

''నీవు చూసింది మంత్రశాస్త్రంలో వెయ్యోవంతు శక్తి మాత్రమే!'' అన్నాడు సువాకుడు.

''అయితే, మీకున్న శక్తినంతా ప్రదర్శించి, మమ్మల్ని మరింతగా ఆనందపరచరాదా,'' అన్నది విద్యుల్లత.

''ప్రస్తుతం నాకున్న శక్తి యింతే! నా శక్తిని యింకా పెంపొందించుకోవాలంటే, నాకు నీ సాయం కావాలి,'' అన్నాడు సువాకుడు.

''చెప్పండి, నా శక్తికొద్దీ సాయపడతాను,'' అన్నది విద్యుల్లత.





సువాకుడు ఒక్క క్షణం తటపటా యించి, "నువ్వు, నన్ను వివాహం చేసుకుంటే నేను, యీ ప్రపంచంలో తిరుగులేని మంత్రవేత్తనవుతాను. మనమిద్దరం ప్రపంచానికేవీలికలంకావచ్చు."అన్నాడు.

విద్యుల్లత విచారంగా, "అయ్యో, మీకు సాయపడేశక్తి లేని దురదృష్టవంతురాలిని. నా వివాహం విజయపురి రాజు వీరసేనుడితో నిశ్చయమైపోయింది కదా! వారు రేపే యిక్కడికి తరలిరానున్నారు కూడా," అన్నది.

ఈ మాటలు వింటూనే సువాకుడు వెలవెలపోయాడు. తరవాత కొద్దిక్షణాల కాలం ఆలోచించి విద్యుల్లతతో, "వీరసేనుడిని వివాహం చేసుకుంటే, నువ్వు విజయపురికి మాత్రమే రాణివవుతావు. నన్ను వివాహం ఆడితే, యీ ప్రపంచానికే రాణివి కాగలవు." అన్నాడు.

"ఏం చేసేది? ప్రపంచానికి మహారాణినయ్యే అదృష్టం లేదనుకుంటాను." అన్నది విద్యుల్లత.

"నీ మూలంగా నాకు మహా చక్రవర్తినయ్యే అదృష్టం లేకుండా పోతున్నది. ఇందుకు ఫలితం అనుభవిస్తావు! నేను, వీరసేనుడు వచ్చేదాకా యిక్కడ కాచుకుని వుంటాను," అన్నాడు సువాకుడు.

మర్నాడు వీరసేనుడు నగరం చేరాడు. సువాకుడు అతణ్ణి కలుసుకుని, తన సంగతి చెప్పుకున్నాడు.

అంతా విని వీరసేనుడు ఎంతో శాంతంగా, "రాజకుమారీ, నేనూపరస్పరం ప్రేమించుకున్నాం. నీవు మరేకోరిక కోరినా తీర్చడానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

ఆ జవాబు వింటూనే సువాకుడు పట్టరాని కోపంతో గట్టిగా పళ్ళు కొరికి, "అయితే, కురూపివికా!" అన్నాడు.

వాడి మంత్రప్రభావంవల్ల వీరసేనుడు కురూపిగా మారిపోయాడు.

"ఇప్పుడు నిన్ను, విద్యుల్లత ఎలా వివాహం చేసుకుంటుందో చూస్తాను!" అంటూ సువాకుడు వికటంగా నవ్వాడు.



వీరసేనుడు అద్దంలో తన ముఖం చూసుకున్నాడు. ఆ కురూపి రూపం అతడికి రోత పుట్టించింది. ఇప్పుడు విద్యుల్లత దగ్గిరకు ఎలా వెళ్ళడం అని విచారంతో అతడు ఆలోచిస్తున్నంతలో, అక్కడ జరిగిందేమిటో విన్న విద్యుల్లత, తన చెలికత్తె ద్వారా అతడికి కబురు పంపింది.

"నేను, మీ రూపాన్ని కాక, మనసును ప్రేమించాను. మిమ్మల్ని తప్ప వేరెవరినీ వివాహం చేసుకోను."

ఇది విన్న వీరసేనుడు, సువాకుడి వంక చూసి, "నువ్వు, మా ప్రేమ ఎంత బలీయమైనదో తెలుసుకోలేదు. కురూపినైనా, విద్యుల్లత నన్నే వివాహమాడుతానంటున్నది," అన్నాడు.

సువాకుడు కోపంగా, "ఆమె ప్రేమ గొప్పదే! కాని, నీ సంగతేమిటి? ఈ కురూపి ముఖంతో నువ్వింకా ఆమెకు తగిన వరుడివనే భావిస్తున్నావా? ఆమె పైన నిజమైన ప్రేమ వుంటే, ఆమెను మరిచిపో. నన్ను వివాహమాడితే ఆమె, యీ ప్రపంచానికే రాణి అవుతుంది," అన్నాడు.

ఆ మాటలకు వీరసేనుడు నవ్వి, "విద్యుల్లతకు, నేను తగిన వరుణ్ణి కాకపోతే, ఆ మాట ఆమె చెప్పాలి కాని, నేనెందుకలా అనుకోవాలి? మా వివాహం తప్పక జరిగితీరుతుంది," అన్నాడు.

ఈ విధంగా సువాకుడు వాళ్ల వివాహం ఆపలేకపోయాడు. వివాహ ముహూర్తం ముగిసిన మరుక్షణమే, వీరసేనుడికి పూర్వరూపం వచ్చేసింది.

సువాకుడు దిగులుపడుతూ యోగి దగ్గిరకు వెళ్ళి, "స్వామీ, నా ప్రయత్నంలో విఫలుణ్ణి అయ్యాను. ఇందుక్కారణం, వీరసేనుడి స్వార్థం!" అంటూ జరిగిందంతా చెప్పాడు.

యోగి సువాకుడి ముఖంకేసి పరీక్షగా చూస్తూ, "నువ్వు మంత్రశాస్త్రం నేర్చుకునేందుకు అర్హుడివి కాదు!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మంత్రవేత్త అయిన యోగి ప్రవర్తన దురన్యాయంగా లేదా? తన శిష్యుడైన సువాకుడికి, రాజకుమార్తె విద్యుల్లతను గురించి చెప్పినది ఆయనే గదా? వాడు భంగపడి తిరిగి వచ్చిన తరవాత, నువ్వు మంత్రశాస్త్రం నేర్చుకునేందుకు అనర్హుడి వనడం, ఏ విధంగా ధర్మం అనిపించు కుంటుంది? తాను కురూపి అయి వుండీ, రాజకుమార్తెను వివాహమాడాలన్న పట్టు దల కనబరచిన వీరసేనుడిలాంటి స్వార్థ పరులు మరెక్కడైనా వుంటారా? ఈ సందే హానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "యోగి ప్రవ ర్తనలో అన్యాయం, అధర్మం అంటూ ఏమీ లేదు. ఆయన మంత్రవిద్య ఉప దేశించే ముందు, తన శిష్యుడి నైతిక ప్రవర్తన ఎలాంటిదో క్షుణ్ణంగా తెలుసు కోవాలనుకున్నాడు. జరిగింది విన్నాక ఆయనకు, సువాకుడు ఆ విద్య నేర్చేందుకు అర్హుడు కాదని తెలిసి పోయింది. ఇక వీరసేనుడి స్వార్థం సంగతి: సువాకుడు రాజకుమార్తెను, ఏ స్వార్థబుద్ధితో వివాహం ఆడాలనుకుం టున్నాడో, వాడి మాటల ద్వారానే అతడు తెలుసుకున్నాడు. ఉన్న కొద్దిపాటి మంత్ర శక్తినే వాడు అన్యాయంగా అతని మీద ప్రయోగించి కురూపిని చేశాడు. అలాంటివాడు నిజంగానే ఆ శాస్త్రంలో నిధి అయితే, ప్రపంచానికే ముప్పు తేగలడు. అందువల్ల వీరసేనుడు, విద్యుల్లతను సువాకుడికి దక్కనీయ కూడదనుకున్నాడు. ఆ సత్సంకల్ప బలమే సువాకుడి మంత్రశక్తిని బలహీన పరిచి, వివాహం కాగానే వీరసేనుడికి యథారూపం వచ్చేలా చేసింది. కనక, యిందులో వీరసేనుడి స్వార్థం అంటూ చిన్న మెత్తు కూడా లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నోటి దురుసు రోగం

బాదంపూడిలో బంగారయ్య అనే పెద్ద ధనిక రైతు వుండేవాడు. ఆయన తనతో ఏదైనా పని వుండి వచ్చిన ప్రతివాణ్ణీ, పనికిమాలినవాడు అని చులకనగా మాట్లాడేవాడు.

ఒకసారి పని మీద బంగారయ్య పొరుగు గ్రామం వెళ్ళి, అక్కడే బాగా పొద్దు పోవడంతో ఒక సత్రంలో బస చేశాడు. రాత్రి ఎంతకూ నిద్రపట్టక మంచం మీద అటూ, యిటూ దొర్లుతున్న ఆయనకు పక్క గదిలో యిద్దరు సంభాషిస్తూండడం వినిపించింది.

"అయితే, తెల్లవారు జామునే లేచి మీరు కూడా, బాదంపూడి వస్తారన్న మాట! అక్కడ ఎవరింటికి వెళుతున్నారో చెప్పారు కాదు," అన్నది ఒక గొంతు.

"బంగారయ్యగారింటికి!" అని రెండో గొంతు సమాధానం యిచ్చింది.

"పనికిమాలిన బంగారయ్యగారింటికన్నమాట!" అంటూ మొదటి గొంతు చిన్నగా నవ్వసాగింది.

ఆ వెంటనే రెండో గొంతు కంగారు పడుతున్నట్టుగా, "అలా అంటున్నారేం? మీ గ్రామంలో బంగారయ్యను మించిన ధనవంతుడు లేడని విన్నాను. నాకు ఒక్కగానొక్క కొడుకు. ఆయన ఆస్తి పాస్తుల విషయంలో, నాతో సరితూగగలడని నమ్మకం కలిగింది. ఆయన కూతురిని, నా కొడుక్కు చేసుకోవడం ఎలా వుంటుందన్న సంగతి, నలుగుర్నీ విచారించేందుకే బాదంపూడి బయలుదేరాను. ఆయన్ని గురించి మీకు తెలిసినదంతా చెప్పేస్తే, నేనంతదూరం వెళ్ళవలసిన అవసరం లేకపోవచ్చు!" అన్నది.

అందుకు మొదట మాట్లాడిన అతను, "మీరేం కంగారుపడకండి! బంగారయ్య

కమలిని

చాలా గొప్ప ఆస్తిపరుడనేదాంట్లో అబద్ధం ఏమీ లేదు,'' అన్నాడు.

''అలాగా! అయితే, ఆయన్ని పనికి మాలిన బంగారయ్య అని మీరెందు కన్నారు?'' అని బంగారయ్యతో వియ్య మందజూస్తున్న వ్యక్తి ప్రశ్నించాడు.

''బంగారయ్య ప్రతివాణ్ణీ, ఎందుకో ఒకందుకు పనికిమాలినవాడు అని తీసి పారేస్తుంటాడు. అందువల్ల, ఊళ్ళో వాళ్ళు తమలో తాము ఆయన్ని గురించి ప్రస్తావించుకున్నప్పుడల్లా, పనికిమాలిన బంగారయ్య అంటూంటారు. అంతే తప్ప మరేంలేదు,'' అన్నాడు బంగా రయ్య ఊరువాడు.

''అయితే, బంగారయ్యకు నోటి దురుసు రోగం అన్నమాట!'' అంటూ ఆయనతో వియ్యమందజూస్తున్న అతను పెద్దగా నవ్వాడు.

ఈ సంభాషణ అంతా విన్న బంగా రయ్య మంచం మీది నుంచి లేచి పక్క గదిలోకి వెళ్ళాడు. ఆయన్ని చూసి బాదం పూడి గ్రామస్థుడు అదిరిపడ్డాడు. కాని, బంగారయ్య అతణ్ణి చూసీ చూడనట్టు వూరుకుని, పక్కనున్న వ్యక్తితో, ''మీరు మాట్లాడుకున్నదంతా విన్నాను. మనిషికి డబ్బుంటే సరిపోదు. ఎవర్నీ నొప్పించ కుండా మాట్లాడగలిగినప్పుడే, నలుగురిలో గౌరవం వుంటుందని, మా ఊరివాళ్ళు సకాలంలో తెలియజేశారు. అలా జరక్క పోతే, మీలాంటివారితో వియ్యమందే అవ కాశం చేజారిపోయేది,'' అన్నాడు.

''ఈ మాటలు మీ మంచితనాన్నీ, శాంతస్వభావాన్నీ తెలియజేస్తున్నవి!'' అన్నాడు వియ్యమంద వచ్చిన వ్యక్తి.

బంగారయ్య ఒక్కక్షణం ఆగి, ''మీ కభ్యంతరం లేకపోతే, ఈ పెళ్ళి విషయం మాట్లాడేందుకు, మా పురోహితుణ్ణి, నేనే మీ వద్దకు పంపుతాను,'' అన్నాడు.

ఇందుకు వియ్యమందతలచినాయన సంతోషంగా ఒప్పుకున్నాడు. ఆ తరవాత బంగారయ్య దురుసుగా మాట్లాడడం, గ్రామంలో ఎవరూ వినలేదు.






# విదూషకుడి గణితజ్ఞానం

కాంచనగిరి మహారాజు కనకాదిత్యుడు ప్రజల క్షేమంకోసం కొన్ని పథకాలను తలపెట్టి, వాటిని రూపొందించి సక్రమంగా అమలు చేయగల అధికారులకోసం, పరీక్ష ఒకటి ఏర్పాటు చేశాడు. యీ పరీక్షలో నీలుడు, వినీలుడు, నిర్మలుడు గొప్ప ప్రతిభావంతులని రుజువయింది. వీరిలో ఏ ఒక్కరూ, ఎందులోనూ మరొకరికి తీసిపోరని తేలింది.

మహారాజు యీ ముగ్గురినీ అధికారులుగా నియమించి, దేశాభివృద్ధి పథకాలను, ముగ్గురూ సమష్టిగా నిర్వహించేందుకు ఏర్పాట్లు చేశాడు. కాని, కొంత కాలం గడిచాక, యీ ముగ్గురూ పథకాలను అమలుపరుస్తున్న తీరు మహారాజుకు చాలా అసంతృప్తి కలిగించింది. అందుకు కారణం, కాంచనగిరితో పోల్చినప్పుడు, అన్ని విధాలా వెనకబడివున్న పొరుగు రాజ్యం రజతగిరి, యిలాంటి పథకాలనే అమలుపరిచి, చాలా త్వరగా అభివృద్ధి చెందడం. అక్కడ యీ పథకాలన్నీ ఒక్క సుచంద్రుడనే అధికారి అధ్వర్యంలోనే నిర్వహించబడుతున్నవి.

కనకాదిత్యుడు ఒకనాడు మాటల సందర్భంలో, యీ విషయాన్ని తన అంతరంగికుడైన విదూషకుడు విశ్వేశ్వరుడితో ప్రస్తావిస్తూ, "మన దేశంలో ముగ్గురు అధికారులున్నా, కానిపనులు, రజతగిరిలో సుచంద్రుడొక్కడే విజయవంతంగా నిర్వహిస్తున్నాడు! ఇది చూస్తుంటే, మన అధికారులు అసమర్థులని తెలిసిపోతున్నది," అన్నాడు.

దానికి విశ్వేశ్వరుడు, "మహారాజా, సుచంద్రుడు సమర్థుడైన అధికారే! కాని, మన అధికారులు కూడా సమర్థత విషయంలో ఒక్కొక్కడూ యిద్దరు

జొన్నలగడ్డ రత్న



విశ్వేశ్వరుడు యిలా అనగానే, మహా రాజుకు కొంత ఆసక్తి కలిగి, అదేమిటో వివరించమన్నాడు.

"మీరు స్వయంగా ఎన్నిక చేసిన నీలుడు, వినీలుడు, నిర్మలుడు ఈ ముగ్గురిలో, ఏ ఒక్కణ్ణి విడిగా తీసుకున్నా, యిద్దరు సుచంద్రుల విలువ చేస్తారన్న దానిలో సందేహం లేదు. కాని, వారిలో ఏ యిద్దర్ని మాత్రమో కలిపి తీసుకుని పోల్చి చూస్తే, ఒక్క సుచంద్రుడికే సమానం. మరొక ఆశ్చర్యకరమైన విషయ మేమంటే, మన అధికారులు ముగ్గుర్నీ కలిపి లెక్కించి పోల్చినట్టయితే, కనీసం ఒక్క సుచంద్రుడికూడా సమానం కాలేరు!" అన్నాడు విశ్వేశ్వరుడు.

మహారాజు అవహేళనగా, "మన ఒక్కొక్క అధికారీ, యిద్దరు సుచంద్రు లకు సమానం అని ప్రారంభించి, ముగ్గుర్నీ కలిపి తీసుకున్నప్పుడు మాత్రం ఒక్కడిపాటి కూడా చెయ్యడంటున్నావు. ఈ తలకిందుల లెక్కలు విన్నాక, పాండిత్యం మాట ఎలావున్నా కనీసం నీకు చిన్న గుణకారాలు కూడా రావని తేలి పోయింది," అన్నాడు.

"మహారాజా, నాకు చిన్న అంకెల్ని హెచ్చవేయడం రాదంటే అభ్యంతరం చెప్పను. కాని, గణితశాస్త్రంలో ప్రవేశం సుచంద్రులకు సమానులని, నా దృఢ విశ్వాసం," అన్నాడు.

కనకాదిత్యుడు నవ్వి, "ఎవడి దేశ స్థుణ్ణి వాడు పొగిడి, గొప్పగా మెచ్చుకోవ డానికి అనే మాటలివి," అన్నాడు.

మహారాజు జవాబుకు విశ్వేశ్వరుడు "నాకు గణిత శాస్త్రంలో తగుపాటి పాండి త్యం వున్నదన్న సంగతి, యీనాటివరకూ తమకు చెప్పవలసిన అవసరం కలగ లేదు, మహారాజా! నేను, కుతూహలంకొద్దీ, మన అధికారుల సమర్థతను సుచంద్రుడితో పోల్చి అంచనావేస్తూ, కొన్ని లెక్కలు తయారుచేశాను. ఆకారణంవల్లనే నేను, తమకిలా మనవిచేయగలిగాను." అన్నాడు.

లేదంటే మాత్రం అంగీకరించలేను. తమరు సెలవిస్తే, మన అధికారుల సమర్థతను, నేను గణించిన పద్ధతి మీకు మనవి చేసుకుంటాను,'' అన్నాడు విశ్వేశ్వరుడు.

సరే కానివ్వమన్నట్టుగా మహారాజు తలవూపాడు.

''మన అధికారుల మేధాశక్తీ, సమర్థతా మీరెరిగినదే. అటువంటి ముగ్గురు వ్యక్తులకు సమష్టిగా నిర్వహించమని, మీరొక బాధ్యత అప్పగించారు. ఒకే అర్హతలున్న, యీ ముగ్గుర్నీ వారి, వారి వ్యక్తిత్వాలూ, అహం ఒకదాని కొకటి తోడై, వాళ్ళను ఒకే తాటి మీద నడిపించడానికి ఏమాత్రం సహాయపడవు. అందుచేత, యీ ముగ్గుర్నీ కలిపి తీసుకుంటే మాత్రం, ఒక్క సుచంద్రుడికన్నా సరికారని చెప్పాను. ఇద్దరైతే మాత్రం, ముందు గొడవలు పడినా, చివరకు ఒకరి అభిప్రాయంతో మరొకరు రాజీపడడం జరుగుతుంది. ఆ విధంగా వాళ్ళు ఒక్క సుచంద్రుడికి సమానం కాగలరు,'' అంటూ ఆగాడు విశ్వేశ్వరుడు.

మహారాజు ఎంతో కుతూహలంగా, ''ఆగావెందుకు? ఊఁ, కానీ!'' అన్నాడు.

''ఎంతో ప్రతిభావంతులైన మన అధికారులు ముగ్గురిలో, ఏ ఒక్కరికో తమరు పదవీబాధ్యత వప్పచెప్పి వుంటే, ఆ ఒక్కరూ యిద్దరు సుచంద్రుల శక్తిసామర్థ్యాలు ప్రదర్శించి వుండేవారని, నేను ఖచ్చితంగా చెప్పగలను'' అన్నాడు విశ్వేశ్వరుడు.

విశ్వేశ్వరుడి వివరణతో, మహారాజుకు, అతడి లెక్కల వెనక దాగివున్న మర్మంతో పాటు, ప్రతిభావంతులైన వ్యక్తుల మానసిక ధోరణి ఎలా వుండేదీ కూడా అర్థమైంది.

ఆ తరవాత అయన, ఆ అధికారులు ఒక్కొక్కడే వంతులవారీగా పదవీ బాధ్యత నిర్వహించాలని ఆదేశించాడు. కొంతకాలం జరిగాక మహారాజుకు తన అధికారులు సుచంద్రుడికన్నా, విదూషకుడు లెక్కల ద్వారా తేల్చిన దానికన్నా కూడా సమర్థులని తెలియవచ్చింది.



# గొప్ప చిత్రం!

అవంతీ రాకుమారి అందగత్తె; మంచి చిత్రకారిణి. తన వివాహానికి ఆమె ఒక షరతుపెట్టింది. ప్రపంచంలోకెల్లా అందమయినదాన్ని చిత్రంగా గీసి తెచ్చిన, చిత్రకారుడైన రాకుమారుణ్ణి మాత్రమే, తాను వివాహం చేసుకోగలనన్నది, ఆ షరతు.

ఎందరో రాకుమారులు అద్భుతమైన ప్రకృతిదృశ్యాలనూ, వ్యక్తులనూ చిత్రించి తెచ్చారు. వాటిల్లో ఏదీ ప్రపంచంలోకెల్లా గొప్ప సౌందర్యవంతమయినది కాదంటూ, ఆమె తిరస్కరించింది. చివరకు మగధరాకుమారుడు చిత్రించి తెచ్చిన చిత్రపటాన్ని, ప్రపంచంలో యింతకన్న అందమైనది మరొకటిలేదని అంగీకరించింది.

ఇంతకూ మగధరాజకుమారుడు చిత్రించినది, రాజకుమారి చిత్తరువునే!

వివాహం వైభవంగా జరిగిన తర్వాత, అవంతీ రాకుమారి భర్తను, "ఇంతకూ ప్రపంచంలో, అందరికన్న నేనే సౌందర్యవతినని ఎలా నిర్ధారణకు రాగలిగారు?" అని అడిగింది.

"దానిదేముంది? నీ స్థానంలో ఎవరున్నా, నేను వాళ్ళ చిత్రపటాన్నే గీసేవాణ్ణి!" అన్నాడు మగధరాకుమారుడు చిరునవ్వు నవ్వుతూ.

రాకుమారి మొదట నిర్విణ్ణురాలై, తరవాత భర్త తెలివితేటలకు చిన్నగా నవ్వుకున్నది.

— కె. గౌరీశంకర్





# రాజైన మావటివాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు వారణాసినగర సమీపంలో సాధువుగా జీవిస్తూండేవాడు. ఆయన ఒకనాడు భిక్షకోసం నగరానికి వచ్చి, ఒక మావటివాడి ఇంటికి వెళ్ళాడు. ఈ మావటివాడు ఏనుగులను పట్టడంలో, వాటికి శిక్షణ యివ్వడంలో చాలా సమర్థుడు. అతడు రాజు కొలువులో వుండేవాడు.

మావటివాడు బోధిసత్వుణ్ణి ఎంతో భక్తిపూర్వకంగా తన ఇంట్లోకి తీసుకుపోయి, భోజనం పెట్టాడు. తరవాత ఆయనతో వినయంగా, ''తమరు కొద్ది రోజులపాటైనా, నా యింట వుండవలసిందిగా ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు.

బోధిసత్వుడు, మావటివాడి ఇంట వారం రోజులపాటు అతిథిగా వుండి, వెళ్ళిపోయేటప్పుడు, అతడి మేలు కోరుతూ దీవించాడు. ఆ దీవన మావటివాడి ఉన్నతస్థితికి కారణం అయింది.

ఒకనాటి రాత్రి నగరంలోని ఒక దేవాలయ మండపం మీద, కట్టెలు కొట్టి జీవించేవాడొకడు పడుకున్నాడు. దాపులనున్న ఒక చెట్టుకొమ్మల్లో కొన్ని కోళ్ళు నిద్రపోతున్నవి. చెట్టు కింద ఏదో శబ్దం కాగా, కోడిపుంజొకటి మేల్కొని గట్టిగా రెక్కలాడించింది. అప్పుడొక ఎండు పుల్ల విరిగి, కింద కొమ్మపై నిద్రపోతున్న మరొక కోడిపుంజు మీద పడడంతో, దానికి నిద్రాభంగమయింది.

కోడిపుంజు కోపంగా తల ఎత్తి పైకి చూస్తూ, ''అంత పొగరుబోతుతనం మంచిదికాదు! నేనెవరనుకుంటున్నావు? నేను మామూలు కోడినికాదు. నా మాంసం తిన్నవాడికెవడికైనా గొప్ప నిధి దొరికి తీరుతుంది,'' అన్నది.

జాతకకథ




పట్టుకుని చెట్టు దిగి, ఇంటికి బయలు దేరాడు.

వాడు ఇల్లు చేరుతూనే భార్యను పిలిచి, ''ఈ సంగతి తెలుసా? నువ్వు రాణివికాబోతున్నావు!'' అన్నాడు.

వాడి భార్య కోపంగా, ''మతిలేని కబుర్లు చెప్పకు. నేను కట్టెలు కొట్టుకు బతికేవాడి పెళ్ళాన్ని. ఇందుకు నేనేం చింతపడడం లేదు,'' అన్నది.

కట్టెలు కొట్టేవాడు పెద్దగా నవ్వి, ''కట్టెలు కొట్టుకు జీవించే నీ భర్త, సింహాసనం ఎక్కబోతున్నాడు! ఇదుగో, ముందు యీ కోడిని కోసి వండు,'' అని భార్యకు, తాను తెచ్చిన కోడి మాంసాని కున్న మహత్తును గురించి చెప్పాడు.

వాడి భార్యకు కలిగిన సంతోషం అంతా యింతా కాదు. ఆవిడ అప్పటికప్పుడే కోడినికోసి వండింది.

''మనం ముందు నదిలో స్నానం చేసి, తరవాత భోజనం చేద్దాం,'' అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

ఇద్దరూ కొంత అన్నంతోపాటు, కోడి మాంసాన్ని ఒక చిన్న కుండలో పెట్టి, ధానికి మూత బిగించి తీసుకుని, నది దగ్గిరకు వెళ్ళారు.

వాళ్ళు కుండను నది గట్టుమీద పెట్టి, స్నానం చేసేందుకు నదిలోకి దిగారు.

ఆ మాటలకు పై కొమ్మ మీద వున్న కోడిపుంజు కెకకెకమంటూ నవ్వి, ''నా గొప్పతనం నీకేం తెలును! నా మాంసం తిన్నవాడు తప్పక రాజవుతాడు,'' అంటూ రహస్యం బయటపెట్టింది.

ఈ సంభాషణ విన్న కట్టెలు కొట్టే వాడు పరమానందం చెందాడు. వాడు కొంతసేపు వేచివుండి, కోళ్ళు తిరిగి నిద్ర పోతున్నవని తెలుసుకుని, నిశ్శబ్దంగా చెట్టు మీదికి పాకిపోయాడు. తాను రాజే కాగలిగినప్పుడు, నిధులతో పనేమనిపిం చింది వాడికి. ఆ కారణం వల్ల వాడు కింద కొమ్మ మీద వున్న కోడిపుంజును వదిలి, పై కొమ్మ మీద వున్న కోడిపుంజును

చూస్తూండగానే నది పొంగింది. ఆ ప్రవాహవేగంలో గట్టుమీద పెట్టిన కుండ కొట్టుకుపోయింది.

కట్టెలు కొట్టేవాడు తల బాదుకుంటూ, "నేను రాజూ, నువ్వు రాణీ అయే అదృష్టం లేదు; ఏం చేస్తాం!" అన్నాడు. ఇద్దరూ దుఃఖిస్తూ ఇంటిదారి పట్టారు.

ఆ సమయంలో నదికి చాలా దిగువున, బోధిసత్వుడికి ఆతిథ్యం యిచ్చిన మావటి వాడు, ఒక ఏనుగును నదిలో కడుగుతున్నాడు. వాడికి నీటివాలునపడి కొట్టుకు వస్తున్న కుండ కంటబడింది. వాడు దాన్ని పట్టుకుని, మూత విప్పిచూడగా, అప్పుడే వండిన మాంసం, అన్నం కనిపించినై. వాడు ఆశ్చర్యపోయాడు. బాగా ఆకలి గొనివుండడంతో మావటివాడు అప్పటికప్పుడే దొరికిన ఆహారాన్ని తిన్నాడు.

ఇది జరిగిన మూడవ రోజున వారణాసి పైకి శత్రుసైన్యం దండెత్తి వచ్చింది. రాజు, తాను మావటివాడుగా వేషం వేసుకుని, మావటివాడికి రాజోచితమైన దుస్తులూ, యితర అలంకరణలూ చేశాడు. మావటివాడి వేషంలో తనకు శత్రువుల నుంచి ప్రమాదం జరగదని ఆయన భావించాడు.

దండెత్తి వచ్చిన శత్రువులు రాజును ప్రాణాలతో పట్టుకోవాలని పథకం వేశారు. ఆ కారణం వల్ల, వాళ్ళు మావటివాణ్ణి చంపి, అంబారీలో వున్న రాజును



బంధించేందుకు మావటివాడిపై బాణాలు కొట్టసాగారు. వాళ్ళకు మావటివాడి వేషంలో వున్నవాడు రాజని తెలియదు.

శత్రువులు వదిలిన బాణాలు తగిలి, మావటివాడి వేషంలో వున్న రాజు మరణించాడు. మావటివాడికి శత్రువుల ఎత్తుగడ అర్థమైంది. వాడు యుద్ధరంగం నుంచి పారిపోక, పగతీర్చుకోవాలన్న పట్టుదలతో శత్రువులను ఎదిరించి భయంకరంగా పోరాడసాగాడు.

ఇది వారణాసి సైనికులకు ఎక్కడలేని ధైర్యాన్ని కలిగించింది. వాళ్ళు ఆకలిగొన్న సింహాల్లా శత్రుసైనికుల మీది కురికారు. కొద్దిసేపట్లో చచ్చినవాళ్ళు చావగా, మిగిలిన శత్రుసైనికులు యుద్ధరంగం విడిచి పారిపోయారు. వాళ్ళ రాజు మావటివాడి యీ పెటపోటుకు అక్కడికక్కడే మరణించాడు.

యుద్ధం ముగిసింది. శత్రువులపై తమ విజయానికి కారణం, తమ రాజు కాదనీ, అయన మావటివాడనీ, మంత్రులూ, యితర రాజోద్యోగులూ తెలుసుకున్నారు. రాజు మరణించాడు గనక, ఆ స్థానంలో మరొక రాజు అవసరం వున్నది. మరణించిన రాజుకు పిల్లలు లేరు.

రాజుగారి ప్రధాన పౌరోహితుడు, "రాజుగారే స్వయంగా తన దుస్తులూ, కిరీటం మావటివాడికి యిచ్చాడు. కనక, మనకు రాజుకాదగినవాడు మావటివాడే!" అన్నాడు.

"ఆ మాట నిజం! మావటివాడి పరాక్రమం వల్లనే శత్రువులు ఓడి, వారణాసి రక్షించబడింది. కనక, మావటివాడే సింహాసనానికి న్యాయమైన హక్కుదారు," అన్నాడు ప్రధానమంత్రి.

సేనానాయకులూ, యితర ప్రధానోద్యోగులూ; పౌరోహితుడూ, ప్రధానమంత్రీ చెప్పినదానికి తమ ఆమోదం తెలిపారు.

ఈ విధంగా మావటివాడు రాజయ్యాడు. అతడు కోరిన మీదట బోధిసత్వుడు ప్రధాన సలహాదారుగా వుండేందుకు అంగీకరించాడు.





# ఛత్రపతి శివాజీ–2

తమ నాయకుడు శివాజీ, మొగలుల ఖైదు నుంచి తప్పించుకుని రాగానే, మహారాష్ట్రులు మహదానందంతో వేడుకలు జరుపుకున్నారు. 1674 వ సంవత్సరంలో ఛత్రపతి బిరుదంతో శివాజీ మహారాష్ట్రులకు రాజయాడు.

మహారాష్ట్రులకూ, మొగలులకూ తరచూ యుద్ధాలు జరగసాగాయి. అపురూపమైన ధైర్యసాహసాలతో, ఆదర్శవంతమైన నడవడికతో తన అనుచరులకు ఉత్సాహం కల్గించాడు శివాజీ. శివాజీ సేనాని బాజీప్రభు ఒకసారి తమ నాయకుడు సురక్షిత స్థలానికి చేరుకోవాలని, గుహ ముఖద్వారానికి అడ్డుగా నిలబడి, శత్రుసేనలను ఒంటరిగా ఎదుర్కొని ప్రాణాలు అర్పించాడు.






ఓడిపోయిన శత్రువులపట్ల శివాజీ సాదరంగా వ్యవహరించేవాడు. హిందూ మతం పట్ల ఎంతో అభిమానం ఉన్నప్పటికీ, ఆయన ఇతర మతాలను కూడా గౌరవించేవాడు. ఒకసారి ఆయనకు లభించిన ఖురాన్ గ్రంథప్రతిని, ఒక ముస్లిమ్‌కు బహూకరించాడు.



కల్యాణ్ పాలకుడైన ములాన్ అహ్మద్, శివాజీ సేనాపతి అబాజీసోన్‌దేవ్ చేతుల్లో ఓడిపోయాడు. ఓడిపోయిన అహ్మద్ తన అందమైన కూతుర్ని, శివాజీకి బహుమతిగా పంపాడు. కాని, శివాజీ ఆమెను చూడగానే, "నా తల్లి ఇంత అందంగా వుండి వుంటే నేను మరింత అందంగా వుండేవాణ్ణి!" అని చెప్పి, తండ్రి కూతురికి ఇస్తున్నట్టుగా, విలువైన కానుకలిచ్చి, ఆ అమ్మాయిని ఆమె తల్లిదండ్రుల దగ్గరికి పంపాడు.

మత సంబంధమైన ఉపన్యాసాలు వినడం అంటే శివాజీకి ఎంతో మక్కువ వుండేది. ఒకసారి ఆయన తుకారాం ఉపన్యాసం వింటూ వుండగా, ఆ సంగతి శత్రువులకు తెలిసింది. వెంటనే శత్రుసైనికులు ఆ సభను గాలించసాగారు. అప్పుడు, శివాజీని పోలిన ఒక వ్యక్తి, అక్కడినుంచి పరిగెత్తడం చూసిన సైనికులు, అతణ్ణి వెంబడించారు. సభ ముగిసిన తర్వాత శివాజీ సురక్షితంగా ఇల్లు చేరాడు.





సాధువు రామదాసు సాంగత్యంలో గడపడానికి శివాజీకి అమితమైన ఆసక్తి వుండేది. కాని అంతకన్నా మించిన కార్యాలు సాధించవలసినవాడు శివాజీ అని గ్రహించిన రామదాసు, అతనికి దూరంగా మసలసాగాడు. ఒకసారి భిక్ష కోసం తన ఇంటి ముందు నిలబడిన రామదాసును చూసిన శివాజీ, తన రాజ్యాన్నంతా ఆ సాధువుకు ఇస్తున్నట్టు వీలునామా రాసి, భిక్షాపాత్రలో వేశాడు.

ధర్మబద్ధమైన సామ్రాజ్యాన్ని పటిష్ఠం చేయమని, రామదాసు శివాజీకి ఆదేశించాడు. ఆ మహత్తర కార్యంలోనే శివాజీ నిమగ్నుడయ్యాడు. హిందూ దేవాలయాల నిర్మాణానికి మాత్రమే కాకుండా, ముస్లిమ్ మసీదులు నిర్మించడానికి కూడా శివాజీ సహాయం చేశాడు. ఆయన ఏ మతంపట్లగాని విరోధం వహించలేదు. కాని, ఔరంగజేబు మత దురభిమానాన్ని మాత్రం ఎదిరించి పోరాడాడు.





సాహస వీరుడూ, మహా నాయకుడూ అయిన శివాజీ యాభై మూడవ యేటే (1680వ సంవత్సరంలో) కన్ను మూశాడు. ఆయన మరణం, మహారాష్ట్రులకు మాత్రమే కాకుండా, ఔరంగజేబు పెట్టే హింసలననుభవిస్తున్న వారికందరికీ విషాదం కల్గించింది.

శివాజీ తరవాత అతని కుమారుడు శంభూజీ రాజయ్యాడు. అచంచలమైన ధైర్యసాహసాలతో, శంభూజీ తొమ్మిదేళ్ళపాటు, మొగలుల బారి నుంచి రాజ్యాన్ని కాపాడాడు. తరచూ జరిగే యుద్ధాలలో—మొగల్ సేనలకు ఔరంగజేబు స్వయంగా నాయకత్వం వహించి వచ్చినప్పటికీ—మహారాష్ట్రులు శంభూజీ నాయకత్వంలో, కలిసికట్టుగా పోరాడడం వల్ల జయించలేకపోయాడు.





శంభూజీ నిద్రపోతున్న సమయం చూసి, మొగల్ సేనలు అయన్ను పట్టుకున్నాయి. 1689వ సంవత్సరంలో, శంభూజీ బందీగా వుండి కూడా ఔరంగజేబు దుష్కృత్యాలను తీవ్రంగా నిరసించాడు. ఔరంగజేబు అతణ్ణి దుర్భరమైన చిత్రహింసలు పెట్టి, దారుణంగా చంపించాడు.

శంభూజీ హత్య మహారాష్ట్రులలో మరింత క్రోధాన్నీ, పట్టుదలనూ రేకెత్తించాయి. గెరిల్లాయుద్ధ పద్ధతిని అవలంబించి, వీలుదొరికినప్పుడల్లా మొగల్ సేనలను హతమార్చడానికి పూనుకున్నారు. మహారాష్ట్రుల అధికారాన్ని తుదముట్టించడానికి ఔరంగజేబు శతథా ప్రయత్నించాడు. కాని అతని బలమే రోజురోజుకూ సన్నగిల్లసాగింది.





శివాజీ రెండవ కుమారుడు రాజారామ్, మహారాష్ట్రులకు నాయకత్వం వహించి తొలుత జింగీకోట నుంచీ, ఆ పిమ్మట సతారాకోట నుంచీ, 1700వ సంవత్సరంలో ఆయన మరణించేవరకూ పోరాటం సాగించాడు. రాజారామ్ అనంతరం అతని భార్య తారాబాయి, నాయకత్వం చేపట్టి, సమర్థవంతంగా సేనలను నడిపించసాగింది. ఔరంగజేబుకు శాంతి కరువయింది.




# గాడిద విలువ

కైరోనగరంలో ఒక వడ్డీవ్యాపారి వుండేవాడు. అతడు పరమ ధనాశాపరుడు. తన దగ్గిరకు వచ్చినవాళ్ళ అవసరాన్నిబట్టి, పెద్దపెద్దమొత్తాల్లో వడ్డీవసూలు చేసేవాడు.

అతడికి తాను చాలా తెలివైనవాడినన్న అహంకారం వుండేది. తరచూ, "ఏమనుకుంటున్నారో, నన్ను మోసపుచ్చగలవాడు, లోకంలోనే లేడు!" అంటూండేవాడు.

ఒకసారి నగరంలోని నలుగురు యువకులకు, వడ్డీ వ్యాపారికి తిరుగులేని గుణపాఠం నేర్పాలనిపించింది. వాళ్ళల్లో ఒకడు ఒక గాడిద మీద ఎక్కి, వడ్డీ వ్యాపారి దగ్గిరకుపోయి, "అయ్యా, నా దగ్గిరున్న దీనారాలకు చిల్లర కావాలి," అన్నాడు.

"దానికేం యిస్తాను, కాని ప్రతిఫలంగా కొంత ముట్టజెప్పవలసి వుంటుంది," అని వడ్డీ వ్యాపారి చిల్లర లెక్కపెట్టసాగాడు.

అంతలో అక్కడికి మిగిలిన ముగ్గురు యువకులూ వచ్చి, గాడిద కేసి పరీక్షగా చూశారు. వాళ్ళల్లో ఒకడు రహస్యం చెబుతున్నట్టు చిన్న గొంతుతో, "ఆఁ, ఇదే, ఆ గాడిద!" అన్నాడు.

"నిజమా?" అన్నాడు మరొక యువకుడు ఉత్సాహంగా.

"ఏమో, నాకు నమ్మకం కలగడం లేదు," అన్నాడు మూడవవాడు.

"నువ్వూరుకో. ఇదే మనకు కావలసిన గాడిద! ఎంతకమ్ముతాడో, దాని యజమానిని అడిగిచూడు," అన్నారు మిగిలిన యిద్దరు యువకులూ.

వాళ్ళు, గాడిద మీద సవారయి వచ్చిన యువకుణ్ణి సమీపించి, "నీ గాడిదను ఎంతకు అమ్ముతావు?" అని అడిగారు.

"అమ్మడమా! అసలు దాన్ని అమ్ముతానని, మీరెందుకనుకున్నారు?"

ఈజిప్టు జానపద కథ



వడ్డీ వ్యాపారి తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు. అతను ఆత్రంగా యువకులతో, "మీకంతగా గాడిద అవసరం అయితే ఒకటికాదు, రెండు అమ్మగలను-ఒక్కొదాన్ని వెయ్యేసి దీనారాలకు, ఏమంటారు ?" అన్నాడు.

యువకులు వడ్డీవ్యాపారి మాటలకు నవ్వి, కుర్రాడితో, "రెండు వేల దీనారాలు! ఇది, న్యాయమైన ధర కాదంటావా?" అన్నారు బతిమాలుతున్నట్టు.

"నిజంగా మీరు గాడిదను కొనదలిస్తే, పదివేల దీనారాలు యివ్వండి. ఇది చాలా లాభసాటి బేరం అని, మీకు తెలియంది కాదు," అన్నాడు గాడిద యజమాని.

"అంత డబ్బు మా దగ్గిరలేదు. ఆఖరి మాటగా, ఐదు వేలు యిస్తాం, యిచ్చెయ్యి." అన్నారు ముగ్గురు యువకులూ.

"పదివేలకు ఒక్క చిల్లిగవ్వ తక్కువయినా, అమ్మను," అన్నాడు గాడిద యజమాని.

"అంత మొండిపట్టు కూడదు," అన్నారు యువకులు.

"నన్ను మొండివాడనేందుకు, మీరెవరు? నా గాడిదకు. నేనడిగిన ధర యిస్తే యివ్వండి, లేదూ, పొండి!" అన్నాడు గాడిద యజమాని కోపంగా.

అన్నాడు గాడిద యజమాని యువకుడు ఆశ్చర్యం నటిస్తూ.

"నువ్వు తప్పకుండా గాడిదను మాకు అమ్మాలి. నూరు దీనారాలిస్తాము," అన్నారు ముగ్గురు యువకులూ.

ఆ సంభాషణ విన్న వడ్డీ వ్యాపారి నిర్విణ్ణుడయిపోయాడు. ఎంత బలం, వయసూ వున్న గాడిద అయినా, పది దీనారాలకు మించి చేయదు!

ఈసారి ముగ్గురు యువకులూ కొంచెం కోపంగా, "కాలం వృథా పుచ్చకు. వెయ్యి దీనారాలిస్తాం. సరేనా?" అని అడిగారు, గాడిద యజమానిలా నటిస్తున్న తమ మిత్రుణ్ణి.

దానితో మాటా, మాటా పెరిగి వాళ్ళు కొద్దిసేపు కలహించుకున్నారు. చివరకు గాడిద యజమాని యువకుడు, ముగ్గురు యువకులతో, "మీ ధోరణి, నాకేం నచ్చ లేదు. పదివేల దీనారాలిచ్చినా, మీకు, నా గాడిదను అమ్మను," అనేశాడు.

వాళ్ళు ముగ్గురూ అక్కణ్ణించి కదిలి, వీధి పక్కన వున్న ఒక చెట్టు నీడలో కూర్చున్నారు.

వడ్డీ వ్యాపారి, గాడిద యజమానితో, "కుర్రాడా, ఒక చచ్చు గాడిదకు ఐదు వేల దీనారాలు పలకడం, కలలో కూడా జరగని సంగతి. నా మాట విని అమ్మెయ్యి," అన్నాడు.



"అయ్యా, నా గాడిద గురించిన నిగూఢ రహస్యం, నీకేం తెలుసు? దానికున్న అద్భుత శక్తుల మాట వినండి. దాన్ని నడి రేయి వేళ వదిలితే, భూమిలో ఎక్కడెక్కడ నిక్షేపంగా వున్న ధనాన్ని మనకు చూపించ గలదు," అన్నాడు గాడిద యువకుడు.

తరవాత అతను గాడిదను తీసుకుని, దాపులనున్న ఒక పానీయాలమ్మే దుకాణం దగ్గిరకుపోయి కూర్చున్నాడు.

చెట్టు కింద కూర్చున్న ముగ్గురు యువకులూ, వడ్డీ వ్యాపారి దగ్గిరకు వచ్చి, "అయ్యా, ఆ కుర్రవెధవకు కోపం వచ్చి నట్టుంది. వాడు, గాడిదను మాకు అమ్మడు. మా కోసం మీరు కొనండి. పది వేల దీనారాలే తీసుకోమనండి. మీ సహా యానికి ప్రతిఫలంగా నూరు దీనారా లిస్తాం," అన్నారు.

"నూరా? లాభం లేదు," అంటూ వడ్డీ వ్యాపారి తల అడ్డంగా తిప్పాడు.

"అయితే, రెండువందలు తీసుకోండి. వాడు వెళ్ళిపోకముందే, త్వరగా పోయి కొనెయ్యండి," అంటూ ముగ్గురు యువ కులూ, వడ్డీ వ్యాపారిని బతిమాలారు.

వడ్డీ వ్యాపారి గాడిద యజమాని దగ్గి రకుపోయి, పదివేల దీనారాలకు గాడిదను అమ్మమని అడిగాడు. యువకుడు అందుకు ఒప్పుకున్నాడు. వ్యాపారి పదివేల

దీనారాలు తెచ్చి, అతడికిచ్చి గాడిదను కొనేశాడు.

అతడు, యువకుల దగ్గిరకు వచ్చి, "మీకు, యీ గాడిద కావాలంటే, ఇరవై వేల దీనారాలు యిచ్చుకోవాలి. అది, మీకు యిష్టం లేకపోతే, గాడిదను నేనే అట్టేపెట్టుకుంటాను," అన్నాడు.

యువకులు ముగ్గురూ, గాడిద కేసి పరీక్షగా చూస్తూ, "ఇది, మేం యింత కాలంగా కొనాలనుకుంటున్న గాడిద అవునా, కాదా అన్న అనుమానం కలిగింది! నువ్వే, అట్టేపెట్టుకో," అంటూ, అక్కణ్ణించి బయలుదేరారు.

వడ్డీవ్యాపారి కోపంతో వణికిపోతూ, "ఆగండి! నేను వాడికిచ్చిన పదివేల దీనారాలతోపాటు, సాయపడినందుకిస్తా మన్న రెండు వందలూ కలిపి యిచ్చి, గాడిదను తోలుకుపొండి," అన్నాడు.

"ఆ గాడిదను నువ్వే అట్టే పెట్టుకో మని చెప్పాంగదా!" అంటూ యువకులు ముగ్గురూ అక్కణ్ణించి వెళ్ళబోయారు.

వడ్డీ వ్యాపారి పెద్దగా గొంతెత్తి, "దారే పోయే పెద్దమనుషులందరూ, ఆగండి! ఇటు చూడండి!" అంటూ కేకపెట్టాడు.

బజారున పోతున్న పదిమందీ అతడి చుట్టూ చేరి, సంగతేమని అడిగారు.

వడ్డీ వ్యాపారి వాళ్ళకు ముగ్గురు యువకుల్ని చూపుతూ, "వీళ్ళు కొన మంటే, యీ గాడిదను పదివేల దీనారాలు పోసి కొన్నాను. ఇప్పుడు, వీళ్ళు దీన్ని నా దగ్గిరనుంచి కొనేందుకు యిష్టపడడం లేదు," అన్నాడు.

"పదివేల దీనారాలిచ్చి, గాడిదను కొన్నావా? మరీ అంతవెర్రివాడివా?" అన్నాడు జనంలోంచి ఒకడు. అందరూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు.

నిజంగా పాపం, వడ్డీ వ్యాపారికి కలిగిన నష్టం ఎంతంటే—తొమ్మిదివేల, తొమ్మిదివందల, తొంభైఅయిదు దీనారాలు. అతడు కొన్న గాడిద విలువ అయిదు దీనారాలకు మించదు!





# రాక్షసి చేసిన మేలు

నారాయణవరం గ్రామంలో, వీరేశం అనే యువకుడుండేవాడు. అతడు సాధు గుణం, తెలివితేటలూ కలవాడే కాని, పరమ బద్ధకస్తుడు. అతడికున్న ఆస్తి పాస్తులు, తండ్రి వదిలిపోయిన ఒక పూరిపాకా, దాని చుట్టూ వున్న పెద్ద ఖాళీ స్థలం. కట్నం కానుకలిచ్చుకోలేని ఒక పేదవాడు, వీరేశం గురించి తెలిసీ, తన కుమార్తెను అతడికిచ్చి పెళ్ళి చేశాడు. ఆమె పేరు మైథిలి.

కాపరానికి వస్తూనే ఆమె, భర్త సోమరి తనం వదలకొట్టేందుకు ప్రయత్నాలు ప్రారంభించింది. కాని, వీరేశంలో ఎలాంటి మార్పూ రాలేదు. ఇది పనికాదని ఆమె, యింటి చుట్టూ వున్న ఖాళీ స్థలంలో అరటి మొక్కలూ, కొబ్బరి మొక్కలూ నాటి, మిగిలిన స్థలంలో కూరపాదులు పెట్టింది.

అరటి మొక్కలు పెరిగి గెలలు వేయడం ప్రారంభించగానే, వాటిని ఎత్తుకుపోయి పట్నంలో అమ్ముకు వచ్చే పని వీరేశం మీద పడింది.

ఆరోజు వీరేశం అయిష్టంగానే పట్నం బయలుదేరాడు. అతను అరటి గెల భుజాన పెట్టుకుని వీధిలోకి పోతూండగా, వెనకనుంచి మైథిలి, ''దారిలో వున్న అడవిలో, ఏ చెట్టు కిందో పడుకుని నిద్ర పోక, చీకటిపడక ముందే యింటికి వచ్చెయ్యి,'' అని హెచ్చరించింది.

వీరేశం పట్నం సంతలో అరటి గెల అమ్మి, ఆ వచ్చిన డబ్బులో నుంచి ఒక పావలా పెట్టి మిఠాయి కొనుక్కుని తిన్నాడు. మిగిలిన డబ్బు పంచె కొంగున మూట కడుతూండగా అతడికి, మైథిలి గుర్తుకు వచ్చింది. ఆమె, యీ మధ్య కొన్నాళ్ళుగా పగిలిన అద్దంలో ముఖం

మాచిరాజు కామేశ్వరరావు



చూసుకుంటున్నది. భార్యకు అద్దం కొని బహూకరించాలని వీరేశానికి బుద్ధిపుట్టింది.

అతను రెండు రూపాయలు పెట్టి, అద్దం ఒకటి కొని ఇంటికి బయలుదేరాడు. గ్రామం చేరేందుకు రెండు దారులున్నాయి. ఒకటి చుట్టు దారి; రెండవది దగ్గిర దారి. ఈ దగ్గిర దారిన వెళ్లాలంటే, ఒక చిన్న కాలవ ఈది, దట్టమైన అడవి గుండా పోవాలి. త్వరగా ఇల్లు చేరాలనే ఆదుర్దాకొద్దీ వీరేశం, యీ దగ్గిర దారిన బయలుదేరి, కాలవ ఈది అవతలికి చేరాడు.

ఆ సరికి మిట్టమధ్యాహ్నం అయింది. ఒక గుబురు చింతచెట్టు కింది నీడను చూస్తూనే, వీరేశానికి ఎక్కడలేని బద్ధకం వచ్చింది. అతను, ఆ చింత కిందకు పోయి అద్దాన్ని పక్కన పెట్టుకుని పడుకుని నిద్రపోయాడు.

ఆ చెట్టు మీద ఒక బ్రహ్మరాక్షసి వుంటున్నది. అది, ఆ సమయంలో గాఢ నిద్రలో వున్నది. కొంతసేపటికి ఎండ పడుకున్న వీరేశం మీదా, అతను కొన్న కొత్త అద్దం మీదా పడింది. అద్దం మీద పడిన ఎండ, చెట్టుకొమ్మల్లో నిద్రపోతున్న బ్రహ్మరాక్షసి ముఖం మీద వేడిగా తగిలి, దానికి నిద్రాభంగమయింది.

బ్రహ్మరాక్షసి కోపంగా కళ్ళు తెరిచి, చెట్టుకింద వున్న వీరేశాన్ని చూసి, "ఎవడ్రావాడు? నా చెట్టుకింద చేరడానికి, నీకెన్ని గుండెలు!" అని పెడబొబ్బలు పెడుతూ కిందికి దూకింది.

వీరేశం ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. అతడికి ఎదురుగా పెద్ద, పెద్ద జడలతో, భయంకరమైన కోరలతో దుబ్బులా వున్న బ్రహ్మరాక్షసి నిలబడి వున్నది. వీరేశం దాన్ని చూస్తూనే హడలిపోయి; అద్దాన్ని మొహానికి అడ్డం పెట్టుకున్నాడు.

బ్రహ్మరాక్షసికి అద్దంలో తన మొహం కనబడగానే, చెట్టు కింద వున్నది మరొక బ్రహ్మరాక్షసి అనుకున్నది. అది ఆశ్చర్య

పోతూ చప్పట్లు చరిచి, "మనిషి శరీరం, బ్రహ్మరాక్షసి తలా, అద్భుతం! నాలాంటి బ్రహ్మరాక్షసివే అయినా, యింత గొప్ప విద్య ఎక్కడ నేర్చుకున్నావు ?" అని వీరేశాన్ని అడిగింది.

ఆ ప్రశ్నకు వీరేశం ఆశ్చర్యపడుతూ, మొహానికి అడ్డం పెట్టుకున్న అద్దాన్ని పక్కకు తీశాడు. బ్రహ్మరాక్షసి యీసారి మరింత ఆశ్చర్యపోయి, "ఇప్పుడు నీ మొహం అచ్చు మనిషి మొహంలా మారి పోయింది. ఈ క్షణంలో కావాలంటే నువ్వు మనుషుల మధ్యకుపోయి కాలం గడపగలవు. చాలా కాలంగా నాకూ మనుషుల మధ్య తిరగాలని ఆశగా వున్నది. నువ్వు, నన్ను మనిషిగా మార్చ లేవా ?" అని అడిగింది.

ఈ ప్రశ్న వింటూనే వీరేశానికి ఒక ఆలోచన వచ్చింది. ఇంతకాలం తనను అందరూ బద్ధకస్తుడనీ, సోమరి అనీ అను కుంటున్నారు. తాను బ్రహ్మరాక్షసిని మనిషిగా మార్చలేకపోయినా, దాని క్రూర స్వభావాన్ని మార్చి, మనుషుల మధ్యకు తీసుకుపోతే, అందరూ తనకు బ్రహ్మ రథం పడతారు !

వీరేశం యిలా ఆలోచించి బ్రహ్మ రాక్షసితో, "నిన్ను తప్పకుండా మనిషిగా మార్చుతాను. అయితే, నువ్వు ముందు



మనుషుల అలవాట్లన్నీ నేర్చుకోవాలి. క్రూర స్వభావం వదిలి, సాధువుగా మారాలి. అప్పుడు నా మాదిరిగానే, నీకు మనిషి రూపం వస్తుంది," అన్నాడు.

"బావుంది, నువ్వు చెప్పినవన్నీ నేర్చు కుంటాను," అన్నది బ్రహ్మరాక్షసి ఉత్సాహంగా.

వీరేశం దానికి మనుషుల మధ్య వుండే బంధుత్వాలూ, మర్యాదలూ, పలక రింపులూ గురించి చెప్పి, చీకటి పడు తూండడంతో, "రేపు చీకటి పడ్డాక యిక్కడికి వస్తాను. నిన్ను పూర్తిగా మనిషిని చెయ్యడానికి, ఆరు మాసాలు పట్టవచ్చు," అన్నాడు.

అతడు బాగా చీకటిపడి ఇల్లు చేరే సరికి, అతడి కోసం ఎదురుచూస్తున్న మైథిలి, ''ఇప్పటికైనా వచ్చావు! నేను ఎంత కంగారుపడిపోతున్నానో తెలుసా?'' అన్నది కోపంగా.

బ్రహ్మరాక్షసి సంగతి చెపితే, అమె హడలిపోతుందని గోప్యంగా వుంచాడు, వీరేశం. అతడు తెచ్చిన కొత్త అద్దాన్ని చూసి మైథిలి మురిసిపోయింది.

మర్నాటి సూర్యాస్తమయ సమయంలో వీరేశం, భార్యకు యిప్పుడే వస్తానని చెప్పి, ఇంటి నుంచి బయలుదేరాడు. ఇంత బద్ధకస్తుడు, యీ వేళప్పుడు ఎక్కడికి వెళ్తున్నాడనుకుంటూ మైథిలి ఆశ్చర్యపడింది.

ఆ రాత్రి వీరేశం, బ్రహ్మరాక్షసికి మనుషుల ఆచారాలూ, అలంకరణలూ గురించి వివరంగా చెప్పాడు. తరవాత బాగా పొద్దుపోయి ఇల్లు చేరగానే భార్య, ''ఇప్పటిదాకా ఎక్కడున్నావు?'' అని అడిగింది.

వీరేశం బాగా అలిసిపోయినట్టు ఉస్సురుమంటూ పోయి మంచం మీద పడుకున్నాడు. అతను మర్నాడు అడవికి వెళ్ళేసరికి బ్రహ్మరాక్షసిలో ఎక్కడలేని మార్పు వచ్చింది. అది మనుషుల అలంకరణలు గురించి వినడంతో, తన పొడ వాటి గోళ్ళు కత్తిరించుకున్నది. తరవాత కాలవలో స్నానంచేసి, తలలో మోదుగ పూలు తురుముకున్నది.



వీరేశం దాన్ని మెచ్చుకుంటూ, "నేను చెప్పింది, నీకు బోధపడుతున్నది. నువ్వు యింకా చాలా నేర్చుకోవాలి," అని, ఆరోజు మనుషుల మధ్య సంభాషణ ఎలా మృదువుగా వుంటుందో వివరించాడు.

ఆ రాత్రి అతడు ఇల్లు చేరగానే భార్య, "రోజూ రాత్రివేళ ఎక్కడికి వెళుతున్నావు? నీకు బద్ధకం వదిలిపోతూండడం బాగానే వున్నది కాని, ఆ పోతున్న చోటేదో చెప్పవేం!" అని కోపగించుకున్నది.

వీరేశం ఏమీ మాట్లాడలేదు. మైథిలి గొడవ ప్రారంభించింది. దానితో భార్యాభర్తల మధ్య చిన్న తగువయింది.

అయినా, బ్రహ్మరాక్షసిని సాధువుగా చేసి గ్రామానికి తీసుకు రావాలనే పట్టుదలలో వున్న వీరేశం, భార్య అన్న మాటలను సహించి వూరుకున్నాడు.

ఒకరాత్రి బ్రహ్మరాక్షసి. వీరేశంతో, "నువ్వు, నా కోసం చాలా శ్రమపడుతున్నావు. నీ కష్టం వుంచుకోనులే," అన్నది.

ఆ మాటలతో వీరేశానికి బ్రహ్మరాక్షసి నుంచి తనకు ఏదో కొంత ధనం ముట్టుతుందన్న ఆశ కలిగింది.

ఒకనాటి రాత్రి, భర్త యిలా రోజూ ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకోవాలన్న పట్టుదలతో మైథిలి. ఒక చింత బరికె తీసుకుని, అతడి వెనకగా బయలు





దేరింది. వీరేశం బ్రహ్మరాక్షసి దగ్గిరకు నిర్భయంగా పోవడం చూసి హడలిపోతూ ఒక పొద చాటున దాక్కున్నది.

బ్రహ్మరాక్షసి, వీరేశంతో, "మనుషుల అలవాట్లు నాకు అబ్బేలా చేశావు, బాగానే వున్నది. ఇప్పుడు నాకు మనుషుల్లా చక్కగా పాడడం నేర్పు," అన్నది.

వీరేశం తనకు వచ్చిన పాట ఒకటి గొంతెత్తి పాడసాగాడు. బ్రహ్మరాక్షసి అతణ్ణి అనుకరిస్తూ పాడడం మొదలు పెట్టింది.

ఇది చూస్తూనే మైథిలికి బ్రహ్మరాక్షసి అంటే భయం పోయింది. ఆమె చింత బరికె పైకెత్తి పట్టుకుని పొదచాటు నుంచి బయిటికి వస్తూ, "ఇంతకాలంగా నువ్వు చేస్తున్న ఘనకార్యం యిదా? నిజంగానే నీలో బద్ధకం వదిలిందనుకున్నాను. ముందుగా నీ శిష్యురాలికి బుద్ధి చెప్పాలి!" అని, చింతబరికెతో బ్రహ్మరాక్షసిని కొట్ట సాగింది.

బ్రహ్మరాక్షసి కేకలు పెడుతూ, "రక్షించండి! ఈవిడెవరో బ్రహ్మరాక్షసిలా వున్నది," అంటూ అక్కణ్ణించి పారిపో సాగింది.

వీరేశానిక్కూడా ఆ క్షణంలో భార్య అంటే భయం కలిగింది. అతడూ, బ్రహ్మ రాక్షసి వెనగ్గా అరణ్యం లోపలికి పరుగు తీశాడు. కొంతదూరం పోయాక బ్రహ్మ రాక్షసి ఆయాసపడుతూ కూర్చుని, వీరేశాన్ని, "నా వెంట వచ్చావెందుకు?" అని అడిగింది.

"నీకు మనుషుల్ని గురించి ఎన్నో ముఖ్య విషయాలు బోధించాను గదా? నాకు గురుదక్షిణగా, ఏదో యింత ధనం ముట్టచెప్పడం న్యాయం," అన్నాడు వీరేశం.

వీరేశం యిలా అడగగానే బ్రహ్మ రాక్షసి లేచి నిలబడి, "నువ్వు బోధించిన దంతా, ఆ ఆడమనిషి చింతబరికెలతో మరుపున పడిపోయింది. నాకిప్పుడు మనుషుల మధ్య జీవించాలన్న కోరిక

లేదు. అసలు మనిషనేవాడు కనిపించని అడవి మధ్యకు పోయి బతుకుతాను,'' అంటూ వేగంగా వెళ్ళిపోయింది.

ఇది చూసి వీరేశానికి మతి పోయినట్టయింది. తెల్లవారేవరకూ అక్కడే కూర్చోవడమా లేక ఇంటికి వెళ్ళడమా అని అతడు ఆలోచిస్తున్నంతలో, అటుగా చిన్న కట్టెల మోపు నెత్తిన పెట్టుకుని ముసలి భద్రయ్య తాత వచ్చాడు. వీరేశం అతణ్ణి పలకరించాడు.

భద్రయ్య తాత అతడి కేసి ఆశ్చర్యంగా చూసి, మోపు కింద పెట్టి, ''ఏరా, బద్ధకాల వీరేశం! యిక్కడేం చేస్తున్నావు?'' అని అడిగాడు.

వీరేశం ఒక వైపు బాధ పడుతూనే, జరిగినదంతా తాతకు చెప్పి, ''నే చేసిన తప్పేమిటి?'' అని అడిగాడు.

భద్రయ్య తాత కొంచెం సేపు ఆలోచిస్తూ ఫూరుకుని, ''నిన్నా మొన్నటి వరకూ బద్ధకం బతుకు బతకడం, నీవు చేసిన తప్పు. అది వదిలించుకుని, ఎక్కడో అడవిలో వున్న బ్రహ్మరాక్షసిని మనుషుల మధ్యకు తేవాలని ప్రయత్నించడం పెద్ద తప్పు. ఏమైతేనేం, నీలో నుంచి బద్ధకమనే బ్రహ్మరాక్షసి పారిపోయింది. ఇకనుంచయినా ఒళ్లు వంచి పని పాటులు చేసుకుంటూ, ఉన్నంతలో సుఖంగా బతకడం నేర్చుకో,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆ క్షణంలో వీరేశానికి తన భార్య ఒక్కతే ఇంటి పనులతోపాటు, ఖాళీ స్థలంలో అరటి చెట్లూ, కూర పాదులూ పెంచేందుకు పడుతున్న శ్రమ కళ్ళకు కట్టినట్టయింది.

అతడు కూర్చున్న చోటు నుంచి ఉత్సాహంగా లేచి, భద్రయ్య తాత తెచ్చిన కట్టెల మోపును ఎత్తి తన తలపై పెట్టుకుంటూ, ''నువ్వు చెప్పింది నిజం, తాతా! ఇక, యీ వీరేశం ఎంతటి పనిమంతుడవుతాడో, నీవే చూద్దువు గాని. ఒకరకంగా యిది నాకు బ్రహ్మరాక్షసి చేసిన మేలు!'' అన్నాడు.



# మాట చెల్లుబడి

రాచకొండ గ్రామస్థులు కొందరు అక్కడా, యిక్కడా ఉద్యోగాలు చేసి, పదవీవిరమణ తర్వాత స్వగ్రామం చేరారు. వాళ్ళు ఒకనాటి సాయంకాలం రచ్చబండ మీద చేరి కబుర్లు చెప్పు కుంటూండగా, పదేళ్ళ కుర్రవాడొకడు అక్కడికి వచ్చి, ఒక వృద్ధుడితో, "తాతయ్యా, రాత్రికి ఏం కూర వండమంటావో అమ్మా, నాయనమ్మా అడిగి రమ్మన్నారు," అన్నాడు.

అది వింటూనే ఆ కుర్రవాడి తాత మీసాలు మెలివేస్తూ, "చూశారా! నా కుటుంబంలో నా కొడుకు, కోడలు, మనవడు సైతం, నా మాట జవదాటడానికి వీల్లేదు," అన్నాడు.

దానితో మిగతా వృద్ధులు కూడా కుటుంబంలో తమ మాట ఎలా చెల్లించుకుంటున్నదీ, ఒకళ్ళను మించి ఒకళ్ళు గొప్పలు చెప్పుకోసాగారు.

అంతా వింటూ మౌనంగా కూర్చున్న వృద్ధుడొకడు, అక్కడినుంచి లేచి వెళ్ళబోతూంటే, మిగతా వాళ్ళు ఆయన్ని, "నీ సంగతి చెప్పవేం! నీ ఇంట్లో, నీ మాటే చెల్లుతుందా?" అని అడిగారు.

"అసలింతవరకూ, యీ మాట చెల్లడం అనేది, యింత గొప్ప విశేషం అన్న సంగతే నాకు తెలియదు," అంటూ ఆ వృద్ధుడు ఇంటిదారి పట్టాడు.

—ఎం. డి. సౌజన్య





# విష్ణు కథ

రాముడు కోదండాన్ని ఎక్కుపెట్టగానే, పరశురాముడు, ''రఘురామా! ఇకనుండి క్షత్రియులపై పగ విడిచి ప్రశాంతంగా తపస్సు చేసుకొంటాను. నేనిచ్చిన కోదండం నీదే! నీవు కోదండరాముడివి!'' అని చెప్పి వెళ్ళాడు.

అయోధ్యానగరం నూతన వధూవరుల ఆగమనంతో కళకళలాడింది.

సీతారాములు ఒకే ఒక్క పరిపూర్ణ స్వరూపంగా అనురాగ సామ్రాజ్య సింహాసనం అలంకరించారు.

ఒకనాడు రాముడు, ''సీతా! ఈ రాజ ప్రాసాదంలోకంటే, మనం సుందరవనాల్లో విహరిస్తూంటే ఇంకెంత ఆనందంగా ఉంటుందో! వనలక్ష్మిలాగ నువ్వు కనిపిస్తూంటే....'' అని అంటూంటే సీత బుగ్గలు ఎరుపెక్కాయి.

వారికి రోజులు మధురంగా గడుస్తున్నాయి.

కొంత కాలానికి దశరథుడికి దుర్నిమిత్తాలు తోచాయి. ఉల్కలు రాలుతూ కనిపించాయి. ఆతనికి ముని దంపతుల శాపం గుర్తు వచ్చింది, ప్రాణభయం పట్టుకుంది.

రాముడికి వెంటనే పట్టాభిషేకం చెయ్యాలని నిశ్చయించి వసిష్ఠుడిచేత ముహూర్తం పెట్టించాడు.

అక్కడ సత్యలోకంలో బ్రహ్మ పద్మాసనంలో చిదానందంగా ఉన్నాడు. సరస్వతి వీణపై రాగమాలిక ఆలపిస్తున్నది.

12. శ్రీరామ వనవాసం



నారదుడు, అతని వెనక దేవతలు వచ్చారు. నారదుడు, "రాముడు సింహాసనం ఎక్కి కూర్చుంటే రాక్షస నిర్మూలనం ఎలా జరుగుతుంది? అని దేవతలంతా తల్లడిల్లుతూన్నారు!" అన్నాడు బ్రహ్మతో.

బ్రహ్మ సరస్వతి వంక చూశాడు. సరస్వతి మందహాసంతో, "జరగవలసింది జరగకమానదుకదా, నారదా! త్రికాలవేత్తవు! అదుగో అటు చూడు! నీకు వారసురాలు మంధర కైకేయి మందిరానికి వెళ్తున్నది!" అన్నది.

దేవతలూ, నారదుడూ క్రిందికి భూమ్మీదకు చూశారు. గూని మోసుకొంటూ మంధర గొణుక్కొంటూ వెళ్తూన్నది.

నారదుడు, "అమ్మా, వాగ్దేవీ! లోక కల్యాణార్థం వాళ్ళ నోట ఎలాంటి వాక్కులు పలికిస్తావో మరి! అంతా నీ దయ!" అని వెళ్ళాడు.

గూనిమంధర కైకేయితో అరణంగా వచ్చిన నమ్మిన ముసలిదాసి. అప్పుడే నిద్రలేస్తున్న కైకేయిని జాలిగా చూస్తూ నిలబడ్డది.

కైకేయి, "ఏమిటి, మంధరా, అలా దిగాలుగా నిల్చున్నావు?!" అనడిగింది.

"ఏం చెప్పమంటావు, తల్లీ! రేపు రాముడికి పట్టాభిషేకమట! పట్టాభిషేకం!!" అంది మంధర.

కైకేయి తన మెడలోని ముత్యాల హారం తీసి మంధర మెడలో వేస్తూ, "ఎంత మంచివార్త తెచ్చావే, మంధరా!" అంటూ ఆనందం పట్టలేకపోయింది.

మంధర పెదవి విరుస్తూ, "అయ్యో, కైకేయీ! ఎంత అమాయకురాలివి పాపం! ఒట్టి వెర్రిబాగులదానివి!" అన్నది.

"ఏమిటి నువ్వనేది?" అన్నది కైకేయి.

"రాముడు రాజైతే, ఆ కౌసల్య ముందు నేనూ, నువ్వూ దాసీలమే! బాగా ఆలోచించు, ఆలసించకు, కోప గృహంలోకి వెళ్ళు! నీ రెండు వరాలు ఇప్పుడు కోరుకో! భరతుణ్ణి దేనికి కన్నావు? రాముడి వెనక ఛత్రచామరాలు పట్టడాని

కేనా?'' అని మంథర చురకలు పెట్టినట్టు అన్నది.

తన రెండు వరాలు ఇప్పుడు కావాలని కైకేయి కోరింది. ''ఏవి కావాలో అవి తీసుకో!'' అన్నాడు దశరథుడు.

''పధ్నాలుగేళ్ళు రాముడు వనవాసం చెయ్యాలి! భరతుడికి పట్టాభిషేకం కట్టాలి!'' అన్నది కైక.

ఆ మాటలు వింటూనే దశరథుడు జుట్టు పీక్కొంటూ అలాగే శయ్య మీద మూర్ఛపడిపోయాడు.

రాముడికి పిలుపు అందింది.

''పితృ వాక్య పరిపాలన తన కర్తవ్యం! దశరథుడు ఆడితప్పినవాడని' పించుకోకూడదు. రఘువంశంలో అటు వంటిది లేదు!'' అనుకున్నాడు రాముడు. తండ్రి మాట నిలబెట్టడానికి రాముడు చెట్టు బెరడుతో తయారైన బట్టలు ధరించి వనవాసం చెయ్యడానికి సిద్ధమయ్యాడు.

లక్ష్మణుడు మహాసర్పం బుసలు కొడుతున్నట్లు వచ్చాడు. కైకేయినీ, దశ రథుడినీ నరికేస్తానని కత్తి దూశాడు. రాముడు తమ్ముడిని శాంతపరిచాడు.

రాముడితో సీత, లక్ష్మణుడు బయలు దేరారు.

అయోధ్యా పౌరులు దారికి అడ్డంగా పడుకున్నారు. రాముడు వారిని సమా



ధానపరిచి గంగానదిని దాటి అరణ్య మార్గం పట్టి, భరద్వాజాశ్రమం చేరు కున్నాడు.

మర్రిపాలు తలకు పట్టించి, రామ లక్ష్మణులు మునులకుమల్లే జుట్టుముళ్ళు వేసుకున్నారు.

దశరథుడు మూర్ఛనుండి తేరుకొని, రాముడు వనవాసం వెళ్ళిన సంగతి తెలుసుకొని, ''రామా! రామా!'' అంటూనే ప్రాణాలు విడిచాడు.

అప్పుడు భరతశత్రుఘ్నులు తాతగారి ఊళ్ళో ఉన్నారు. నందిగ్రామం నుండి భరతశత్రుఘ్నులు' వచ్చాక, భరతుడు తండ్రికి ఉత్తరక్రియలు జరిపాడు.




భరతుడు తల్లి ముఖం చూడలేదు. శత్రుఘ్నుడు మంథర గూనిపోయేలాగ తన్నాలనుకున్నాడు. కాని దాని జాడ కనిపించలేదు.

భరతుడు రాముణ్ణి తీసుకురాడానికి సపరివారంగా శ్వేతఛత్రాలు పట్టించుకుని వెళ్ళాడు.

భరతుడితో రాముడు, "మన తండ్రి మాట నిలపడంలో మన ఇద్దరివంతూ ఉంది. నీవు నా తమ్ముడివి, నా మాట విను. పట్టాభిషిక్తుడివై రాజ్యపాలన చెయ్యి!" అన్నాడు.

భరతుడు తల అడ్డంగా తిప్పి, "నేను రాజ్యపాలన మాత్రం చూసుకుంటాను, నీ పాదుకల్ని సింహాసనం మీద ఉంచుతాను!" అని చెప్పి రాముడి పావుకోళ్ళను తలపై పెట్టుకొని తీసుకెళ్ళాడు.

రాముడు సీతాలక్ష్మణ సమేతంగా అరణ్యం లోలోపలికి చొచ్చుకువెళ్ళాడు.

ఖరుడు, దూషణుడు అనేవాళ్ళు దండకారణ్యంలో రావణుడి ప్రతినిధులు. వాళ్ళు వింధ్యపర్వతాలకు దిగువనున్న భూమి అంతా ఆక్రమించారు. వాళ్ళు రాక్షస గుంపులతో తిరుగుతూ, అరణ్యంలో ప్రవేశిస్తున్న నరులను చూశారు.

ఆకలిగొన్న క్రూర మృగాల్లాగ సీతారామలక్ష్మణుల్ని చంపడానికి, పెద్ద పెద్ద బండ కత్తులూ, శూలాలతో చుట్టుముట్టారు రాక్షసులు.

రామలక్ష్మణులు ధనుర్బాణాలు తీసి రాక్షసమూకలను చెల్లాచెదరుగా చేశారు. రాముడు ఖరదూషణుల్ని చంపాడు. రాక్షసులు చాలామంది చచ్చారు. హతశేషులైనవారు పారిపోయారు.

నివాసయోగ్యమైన ప్రదేశంకోసం వెదుకుతూ వెళ్తూండగా, తాటిచెట్టును మించిన ప్రమాణంలో భయంకరాకారుడైన విరాధుడు సీతను అరచేత్తో ఎత్తి భుజాన పెట్టుకొని పారిపోతూంటే, రాముడు ఒక మహాస్త్రాన్ని వేసి రాక్షసుణ్ణి చంపాడు.



హతశేషులైన రాక్షసులు శూర్పణఖతో ఖరదూరషణుల చావుకబురు చెప్పారు.

శూర్పణఖ రావణాసురుడి చెల్లెలు. ఖరుడు, దూషణుడు శూర్పణఖ సొంత తమ్ముళ్ళు.

దండకారణ్యాల్లో గ్రుమ్మరుతూండే రాక్షసులందరికీ శూర్పణఖ నాయకురాలు. రామలక్ష్మణుల్ని చీల్చి చెండాడాలని బయలుదేరింది.

ఊడలే మానులైన ఐదు మర్రిచెట్లతో నిండిన పంచవటికి రాముడు, సీతా లక్ష్మణులతో చేరాడు. పక్కనే గోదావరి ప్రవహిస్తున్నది.

పర్ణశాలను నిర్మించుకొని, రాముడు సీతతో వనవిహారం చేస్తూ వనవాసం గడుపుతున్నాడు. లక్ష్మణుడు అన్నను, వదినను సేవిస్తూ, పర్ణశాలను దివారాత్రాలు కాపలా కాస్తున్నాడు.

శూర్పణఖ అట్టహాసంగా విరుచుకపడింది. రాముణ్ణి చూసి తన్ను వరించమంది, వేడింది, బెదిరించింది. సీతను చంపడానికి ఉరికింది. లక్ష్మణుడు శూర్పణఖను చంపకుండా ముక్కు, చెవులు కోసి తరిమాడు.

శూర్పణఖ లంకకు వెళ్ళి రావణాసురుడితో తనకు జరిగిన పరాభవాన్ని మొరపెట్టుకొంది. సీత అందాన్ని వర్ణించి రెచ్చగొట్టింది. రావణుడు ప్రతీకారంగా సీతను చెరగొని తేవడానికి మారీచుణ్ణి బంగారు లేడిగా పంపాడు.

సీత మాయలేడిని చూసి ముచ్చటపడింది. రాముడు వెళ్ళి పట్టుకోవాలని బాణంవేశాడు. బాణం తగిలి మాయలేడి మారీచుడై, "హా, సీతా! హా, లక్ష్మణా!" అని రాముడు చేసినట్టు ఆర్తనాదం పెద్దపెట్టున చేసి మరీ చచ్చాడు.

అది రాక్షసమాయ, రాముడికెటువంటి హానీ జరగదని లక్ష్మణుడు ఎంత చెప్పినా సీత వినలేదు. నిష్ఠురోక్తులు పలికింది. లక్ష్మణుడు పర్ణశాల ముందు మూడు గీతలు గీచి వెళ్ళాడు.



దశరథుడి ఆప్తమిత్రుడైన జటాయువుకి దహనసంస్కారం చేసి, రామలక్ష్మణులు వెళ్తుండగా, కబంధుడు వన్యమృగాల్తో బాటు వారిని దగ్గరకు లాక్కున్నాడు.

కబంధుడు విచిత్రమైనవాడు. పర్వత మంతటి కడుపు, దానికే కోరలతో అవు లించుకొని ఉన్న పెద్ద నోరు, ఒక నిప్పు లాంటి కన్ను, యోజనాల పొడవునా చాచుకునే చేతులు ఉన్నాయి. తల అంటూ వేరే లేదు, కాళ్ళుగాని మరే అంగాలుగాని లేవు.

రామలక్ష్మణులు కత్తులు తీసి కబం ధుడి చేతులు నరికారు. కబంధుడు శాప గ్రస్తుడైన గంధర్వుడు. శాపవిమోచనం పొంది ఆ గంధర్వుడు, గంధర్వలోకానికి పోతూ, "నీకు వానరులతో మైత్రి కుదురు తుంది, ప్రయోజనకారి అవుతుంది," అని రాముడికి చెప్పాడు.

ఋష్యమూక పర్వతం మీద వానర వీరులతో ఉంటున్న సుగ్రీవుడు రాముడి వద్దకు హనుమంతుణ్ణి పంపాడు.

ముక్కోటి దేవతలు వానరులయ్యారు. హనుమంతుడు శివుడి అంశన పుట్టినవాడు. అంజనాదేవి, వాయుదేవుడి అనుగ్రహంతో హనుమంతుణ్ణి కన్నది. అంజనేయుడు వాయుపుత్రుడు. మారుతి అని పిలువ బడ్డాడు.

సీత ఒంటరిగా ఉంది. రావణుడు వృద్ధతాపసి వేషంతో భిక్షకు వచ్చాడు. సీత భిక్ష వెయ్యడానికి మూడు గీతలూ దాటింది. రావణుడు నిజరూపుతో సీతను ఎత్తుకుపోయాడు.

రామలక్ష్మణులు సీతను వెదుకుతూ వెళ్ళారు. రాముడు సామాన్య పామర మానవుడిలాగే విలపించాడు.

వారలా వెళ్ళగా వెళ్ళగా, రెక్కలు తెగి పడి ఉన్న జటాయు పక్షి, "సీతను విడిపించడానికి పోరాడాను, నా రెక్కలు నరికి రావణుడు దక్షిణ దిశగా సీతను ఎత్తుకుపోయాడు," అని చెప్పి ప్రాణాలు విడిచింది.

పసితనంలో ఆంజనేయుడు ఉదయ సూర్య బింబాన్ని పండని ఎగిరి కబళించ బోగా, ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టాడు. మారుతి మూర్ఛిల్లాడు. వాయుదేవుడికి కోపం వచ్చి స్తంభించాడు. అప్పుడు దేవతలు హనుమంతుణ్ణి చిరంజీవిగా దీవించి, అనేక వరాలు యిచ్చారు.

బ్రహ్మ ఆంజనేయుడి చెవులకు విచిత్ర ప్రభావంగల కుండలాలు తగిలించి, అవి ఎవరికి కనపడి మెచ్చుకుంటే అతడే విష్ణువుగా గుర్తించి, ఆరాధ్యదైవంగా సేవించమని హనుమకు చెప్పాడు.

హనుమంతుడు సుగ్రీవుడి పంపున రామలక్ష్మణుల దగ్గిరికి బ్రహ్మచారి రూపంతో వెళ్ళాడు. రాముడు అతడిని చూసి లక్ష్మణుడితో, "సుందరుడైన ఇతని కర్ణకుండలాలు ఎంత ముచ్చటగా ఉన్నాయో, చూడు!" అంటూ మెచ్చుకున్నాడు.

అప్పుడు హనుమంతుడు రాముడు విష్ణువు అవతారమని గుర్తించి, నమ్మిన బంటు అయ్యాడు. రాముడి చేత సుందరుడు అనిపించుకొన్న హనుమంతుడు, 'సుందరుడు' అని పేరు పొందాడు.

హనుమంతుడి మూలంగా రాముడు, సుగ్రీవుడు అగ్నిసాక్షిగా మిత్రులయ్యారు.

సుగ్రీవుడి అన్న వాలి, కిష్కింధకు రాజు. తమ్ముడిని ద్రోహిగా అపోహపడి చంపబోగా సుగ్రీవుడు తప్పించుకుని పోయి ఋష్యమూక పర్వతం మీద తల దాచుకున్నాడు. వాలి తమ్ముడి భార్యను నిర్బంధంలో ఉంచాడు.

ఆపదలో ఉన్న మిత్రుణ్ణి కాపాడడం తన ధర్మంగా రాముడు ఎంచి, వాలిని సంహరించి సుగ్రీవుణ్ణి కిష్కింధా నగరానికి రాజును చేయడానికి మాట యిచ్చాడు.

వాలి ఎదురుగా నిలిచినవాడి బలం వాలిని చేరేలా వరం ఉంది. ఆ కారణంగా వాలి సుగ్రీవులు పోరాడుతుండగా చెట్టు చాటునుండి రాముడు బాణంకొట్టి వాలిని కడతేర్చాడు.






ఒకానొక దేశంలో ఒక రాజుండేవాడు. ఆయనకు ఒక్కతే కూతురు. ఆ పిల్ల చాలా అందగత్తె. అందుచేత అనేకమంది యువకులు వచ్చి, ఆమెను మా కిమ్మంటే మా కిమ్మని రాజును వేధించుకు తిన సాగారు.

రాజుగారు తెలివితేటలలో ఉద్దండుడు. ఆయనను ఎవరూ మోసగించలేరు. అందు చేత, తన కుమార్తెకు వరుణ్ణి నిర్ణయించ టానికి ఆయన ఒక ఆలోచన చేశాడు. ''నన్ను మోసపుచ్చినవారికి నా కుమార్తె నిచ్చి పెళ్ళిచేసి, నా అర్ధరాజ్యం కూడా కట్టబెడతాను!'' అని ఆయన తన రాజ్య మంతటా చాటింపు వేయించాడు. రాజు గారిని మోసగించటానికి ప్రయత్నించి ఓడి పోయినవారికి కొరడా దెబ్బలు!

రాజకుమార్తెను పెళ్ళాడాలన్న ఆశతో చాలామంది యువకులు వచ్చి, రాజు గారిని మోసగించలేక కొరడాదెబ్బలు తిని వెళ్ళిపోయారు.

ఆ నగరంలోనే ఒక ధనికుడున్నాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. వారిలో పెద్దవాళ్ళిద్దరూ తెలివిగలవాళ్ళు. మూడో వాడు వట్టి చవటలాగుండేవాడు. వాడు ఎన్నడూ ఏ పనికీ అక్కరకు రాక అస్త మానం గోళ్ళు గిల్లుకుంటూ ఒక మూల కూచునేవాడు. వాణ్ణి అందరూ మందబుద్ధి అని పిలిచేవాళ్ళు.

ధనికుడి పెద్ద కొడుకు ఒకనాడు తండ్రితో, ''నాన్నా, రాజకుమార్తెను పెళ్లాడటానికి అందరూ ప్రయత్నిస్తున్నారు. నేను కూడా ప్రయత్నిస్తాను,'' అన్నాడు ఉత్సాహంగా.

''వెళ్ళిరా, నాయనా. ఈ ప్రయత్నించే వాళ్ళంతా నీకన్న తెలివిగలవాళ్ళా ఏమిటి?'' అన్నాడు తండ్రి.




పెద్దవాడు బయలుదేరి రాజుగారి ఇంటికి వెళ్ళి, భటులకు తాను వచ్చిన పని తెలియజేసి, రాజుగారి దర్శనం కోరాడు. భటులు వాణ్ణి రాజుగారుండే గదికి తీసుకుపోయారు. వాడు రాజుగారికి నమస్కారం చేస్తూ కిటికీగుండా బయటికి చూసి, "ఆహా! కనిపించే మూడు నల్ల బాతులూ ఎంత అందంగా ఉన్నాయో!" అన్నాడు.

"నీ తెలివితేటలు తగలడ్డట్టే ఉన్నాయి. చూడటానికి ఒక నల్లబాతు చాలదూ? వీణ్ణి తీసుకుపోయి కొరడాదెబ్బలు కొట్టి పంపెయ్యండి," అన్నాడు రాజు. భటులు వాణ్ణి కొరడాతో కొట్టారు. పెద్దవాడు దెబ్బలు తిని ఇంటికి తిరిగి రాగానే, రెండోవాడికి కూడా అదే బుద్ధిపుట్టింది.

వాడు కూడా తండ్రి అనుమతి పొంది రాజుగారి దర్శనానికి వెళ్ళాడు. వాణ్ణి కూడా రాజుగారి గదిలోకి పంపారు. వాడు కిటికీలోనుంచి బయటికి చూసి, "అదేమిటి? ఆ చెట్టు మీద కూచున్న కాకి వీపుపైన మూడు తెల్లటి చారలున్నాయి!"

"కాకి వీపున చారలు అబద్ధమూ, నీ వీపున వాతలు నిజమూనూ! వీణ్ణి పట్టుకుపోయి కొరడాతో కొట్టి పంపెయ్యండి," అన్నాడు రాజు.

రెండోవాడు కూడా పరాభవం పొంది తిరిగి వచ్చాక, మందబుద్ధి తండ్రితో తాను వెళ్లి రాజును మోసగించి రాజకుమార్తెను పెళ్ళాడతానన్నాడు.

"గడుసువాళ్ళయిన నీ అన్నలకు చేతగాని పని నీవల్ల అవుతుందా? నువు అసలే మందబుద్ధివి!" అన్నాడు తండ్రి.

కాని, వాడు పట్టుపట్టాడు. "సరే, అంత ఉబలాటంగా ఉంటే వెళ్ళి కొరడా దెబ్బలు తినిరా!" అన్నాడు తండ్రి.

మూడోవాడు గోడవంకెను వేళ్లాడే మాసిపోయిన కుళ్ళాయి తీసి దులిపి చేతబట్టుకుని రాజుగారి ఇంటికి బయలుదేరాడు. దారిలో వాడికి ఒక అమ్మి, నెత్తిన కుండల దొంతరలు చేర్చి పెట్టుకుని కనిపించింది.

"ఏమమ్మీ, వీటిని ఎక్కడికి తీసుకు పోతున్నావు?" అన్నాడు మందబుద్ధి.

"అమ్మటానికి, నాయనా!" అన్నదామె.

వాడు వాటి ఖరీదు అడిగాడు. కుండలమ్మే మనిషి మూడు రూపాయలన్నది.

"అయిదు రూపాయ లిస్తాను, నేను చెప్పినట్టు చేస్తావా?" అన్నాడు వాడు. ఆమె ఒప్పుకున్నది. ఇద్దరూ కలిసి రాజు గారింటి దాకా వెళ్ళారు. ఏం చెయ్యాలో ఆమెకు వాడు వివరంగా చెప్పాడు.

ఇద్దరూ రాజుగారింటి బయట ఆగారు. మందబుద్ధి గట్టిగా, "నేను అమ్మను! నాకు కావాలి! ఊరికే నన్ను పీడించకు!" అని అరవసాగాడు.

ఈ కేకలు విని రాజుగారు బయటికి వచ్చి వాణ్ణి చూసి, "ఎందుకలా పొలి కేకలు పెడుతున్నావు? అమ్మటానికి నీ దగ్గిర ఏమున్నది?" అని అడిగాడు.

"ఈ కుళ్ళాయి, మహారాజా! ఇది మాయల కుళ్ళాయి. దీన్ని నెత్తిన పెట్టు కుంటే ఎవరినన్నా మోసగించవచ్చు!" అన్నాడు మందబుద్ధి.

"ఏదీ, ఎవరినన్నా మోసగించు!" అన్నాడు రాజు.

వాడు కుళ్ళాయి నెత్తిన పెట్టుకుని, కుండలమ్మే మనిషి దగ్గిరికి వెళ్ళి, "ఏయ్, నీ కుండలన్నీ పగలగొట్టు!" అన్నాడు.



వెంటనే ఆ మనిషి తన నెత్తిన వున్న కుండలు ఒక్కొక్కటే తీసి నేలకేసి కొట్టసాగింది.

రాజు నిర్ఘాంతపోయాడు. అలాటి కుళ్ళాయి ఇతరుల దగ్గిర ఉండటం తనకూ తన కుమార్తెకూ అంత క్షేమం కాదనుకుని ఆయన దాన్ని తనకు విక్రయించమన్నాడు. మందబుద్ధి చచ్చినా ఆ కుళ్ళాయిని అమ్మ నన్నాడు. రాజుగారు సంచీడు మొహరీలు ఇవ్వజూపినాక వాడు బుర్ర గోక్కుని, "సరే ఇవ్వండి! ఎవరికో ఒకరికి దీన్ని ఎప్పటికైనా అమ్మేదే గదా!" అన్నాడు. వాడు రాజుకు కుళ్ళాయి ఇచ్చి మొహరీల సంచీ తీసుకుని ఇంటికి వెళ్ళాడు.



వాడు ఆ డబ్బుతో గొప్ప దుస్తులు కొని, వాటిని ధరించి మర్నాడు రాజుగారి వద్దకు వెళ్ళి, "తమ కుమార్తెనిచ్చి వివాహం చేయించండి!" అని అడిగాడు.

రాజు కేమనాలో తోచలేదు. కుళ్లాయిలో మహిమ ఏమీ లేదనీ, తనను వాడు మోస గించాడనీ అప్పటికి ఆయన గ్రహించి ఉన్నాడు. చివరకాయన, "నువు నన్ను చెప్పి మోసగించలేదు. రేపు ఉదయం మంత్రిని బలాత్కారంగా నా దగ్గిరికి తీసుకురాగలిగితే నువు నిజంగా తెలివిగల వాడివని నమ్ముతాను!" అన్నాడు.

"చిత్తం" అని వాడు వెళ్ళి పోయాడు. మర్నాడు మంత్రి తన ఇంటనే ఉండి, ఇంటి చుట్టూ నౌకర్లను కాపలా పెట్టి, మందబుద్ధి అక్కడికి వచ్చినట్ట యితే మెత్తగా తన్నమన్నాడు.

ఈలోపల వాడు మారువేషం వేసు కుని ఒక గోతం సంచీలో దూరి మంత్రి గారి ఇంటి సమీపానికి దొర్లుకుంటూ వచ్చాడు. అది చూసి భటులు ఆశ్చర్యంతో, "ఏయ్, సంచీలో ఎవరు?" అని అడిగారు.

"ష్! మాట్లాడకండి!" అన్నాడు మందబుద్ధి.

భటులు ఈ సంగతి మంత్రితో చెప్పారు. ఆయన హడావిడిగా బయటికి వచ్చి సంచీలో ఉన్న మందబుద్ధిని, "ఎవరురా నువూ?" అని గద్దించి అడిగాడు.

"మాట్లాడకండి! ఇది జ్ఞానసంచి! నాకు అనేక విషయాలు చెబుతున్నది!" అన్నాడు మందబుద్ధి తాపీగా.

"ఏదీ? అది చెప్పే సంగతుల్లో ఒకట చెప్పూ!" అన్నాడు మంత్రి.

"నిన్న రాజుగారిని మోసగించిన దుర్మార్గుడు మీ ఇంటిపైకి పదిహేడు మంది యోధులతో వచ్చి పడబోతు న్నాట్ట!" అన్నాడు మందబుద్ధి.

"మరి నేనేం చెయ్యాలి?" అన్నాడు మంత్రి.

"సంచీనే అడగండి!" అన్నాడు మందబుద్ధి.

మంత్రి సంచీ విప్పి వాణ్ణి బయటికి రానిచ్చాడు. మంత్రి సంచీలో కూచుని, "నేనేం చెయ్యాలి ?" అని సంచీని అడిగాడు. ఇంతలోనే మందబుద్ధి సంచీ మూతి బిగించి కట్టి, మంత్రిని భుజాన వేసుకుని పోయి రాజుగారి ఎదట పెట్టాడు.

"ఈ పరీక్షలో గెలిచావు. రేపు వచ్చి అంతఃపురంలో ఉన్న నా కుమార్తెను గుర్తించి పెళ్ళాడు. జ్ఞాపకం ఉంచుకో. నా కుమార్తెకు ఎనభైమంది పరిచారికలు ఉన్నారు. వారిలో నా కుమార్తె ఎవరో నువే గుర్తించాలిగాని నీకెవ్వరూ చూపరు! నా కుమార్తెను గుర్తించలేకపోతే నీకు పెళ్ళిలేకపోగా కొరడాదెబ్బలు తప్పవు! తెలిసిందా ?" అన్నాడు రాజు.

మర్నాడు పొద్దునే మందబుద్ధి ఒక చిన్న సంచీలో ఎలుకను ఒకదాన్ని వేసుకుని అంతఃపురానికి బయలుదేరి వెళ్ళాడు.

వాడు వెళ్ళేసరికి ఎనభైఒక్క మంది కన్యలు, అందరూ ఒకేరకంగా బట్టలు కట్టుకుని నగలు పెట్టుకుని కూచుని ఉన్నారు. రాజు కూడా అక్కడే వున్నాడు.

"వీరిలో నా కుమార్తెను గుర్తించు!" అన్నాడు రాజు.

మందబుద్ధి తన చేతిలోని సంచి విప్పి ఎలుకను ఆ కన్యల మధ్యకు గిరవాటు వేశాడు. కన్యలందరూ కెవ్వున అరిచి అటూ ఇటూ పరిగెత్తారు. కాని వారిలో ఒక్కతే మూర్ఛపోయింది. వెంటనే మిగిలినవాళ్లు ఎలుకను మరిచి మూర్ఛపోయిన కన్యకు ఉపచారాలు చేయసాగారు.

మందబుద్ధికి పరమానంద మయింది. వాడు నవ్వుతూ రాజుగారి కేసి తిరిగి మూర్ఛపోయిన కన్యను చూపించి, "ఈమే మీ కుమార్తె!" అన్నాడు.

చేసేదిలేక రాజుగారు మంచి ముహూర్తం చూసి తన కుమార్తెను వాడి కిచ్చి పెళ్ళిచేసి, అర్ధరాజ్యం కూడా ధారపోశాడు. మందబుద్ధి అందరికన్న తానే తెలివిగలవాడి ననిపించుకుని రాజకుమార్తెతో సుఖంగా కాపరం చేశాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



B. Prasad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబరు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆకలికి విందు

రెండవ ఫోటో : ఆటకు పసందు

పంపినవారు : ఎస్. ఉమాసుధ, డాబాల బజార్, ఖమ్మం–3.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

## మీకు తెలుసా ? సమాధానాలు :

1. కాలిఫోర్నియాలో. 4,600 యేళ్ళు దాటిన ఈ వృక్షం దేవదారు వృక్షజాతికి చెందినది. 2. అశోకచక్రవర్తి కూతురు సంఘమిత్ర గయలోని బోధివృక్షం నుంచి అంటుకట్టి తీసుకుపోయి నాటిన వృక్షం. ఇది శ్రీలంకలోని అనురాధాపురంలో వున్నది. 3. మెక్సికోలోని ఓక్సాకాలో వున్నది. తమాలవృక్షజాతికి చెందిన ఈ వృక్షం బోదె చుట్టుకొలత నూటపది అడుగులు. 4. వెదురుజాతికి చెందిన కొన్ని చెట్లు రోజుకు ముప్పైఆరు అంగుళాలు పెరుగుతాయి. 5. పెన్సిల్‌వేనియాలోని, జూనియాటా నదీతీరంలో వున్న వృక్షం వంద ఎకరాలు వ్యాపించి వున్నది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

**Results of Chandamama Camlin Colouring Contest No. 32 (Telugu)**

*1st Prize:* Girish Vasant Chhidaswar, Yeomal. A. Venkata Ramesh, Srikakulam. *2nd Prize:* L. Gourisankar, Kothapeta. M. Vidya Vashini, Hyderabad. *3rd Prize:* P.V.B. Rajya Lakshmi, Nellore. S.K. Jamaloddin, Survail. G. Visunatha Kumar, Visakhpatnam-530 002. K. Santa, Berahampur-2. P. Anand, Vishakhapatnam-16. P.N.G. Suresh Kumar, Rayagada. T. Venkat Raghavan, Hyderabad. P.V. Ramesh, Raichur 584 101. Vamaravalli Malleswara Rao, Deergbasi. P. Rama Devi, Hyderabad-500 991

## పాయికి లాలీ-పాప్
## రీసే అందించే లాలీ-పాప్!




Parry's
LOLLIPOP

# లాలీ-పాప్
## భలే రుచి

PCL-1273